# సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి

-శ్రీ శివచిదానంద భారతీస్వామి

ఈ శీర్షిక యొక్క అర్థం ఎవరు ఏ దేవునికి నమస్కరించిన, అన్ని దేవతామూర్తులకు సమర్పించిన నమస్కారములు కేశవునకు చెందును. అట్టి ప్రకటన సంకుచితమని అనేక వేల దేవతలకు భక్తితో ఆయా విశ్వాస పరులు నమస్కరించినచో ఏల చెందునని అవహేళన చేయు సందర్భములు గలవు హైందవులలోనే వీరశైవ మతానుయాయులు వారి ఆరాధ్యదైవమైన మహేశ్వరునికి పెట్టిన నమస్కారము కేశవునకు చెందదని తీవ్రవాదము కూడా చేయగలరు. విష్ణువునకు గల సహస్రాధిక నామములలో 'కేశవుడు అను నామము కూడా కలిగియుండుట అందరికి విదితమే. హైందవులలోనే వైష్ణవేతర పంథీయులు అంగీకరించనప్పుడు భిన్నమతములు, సాంప్రదాయములు, విశ్వాసములు గల మహమ్మదీయ, క్రైస్తవ, పారశీక మొదలుగాగల మతస్థులు వారివారి దేవతామూర్తులకు పెట్టిన నమస్కారములు హైందవులలో ఒక భాగమునకు చెందిన విష్ణుదేవునికి చెందుననుటలో ఎట్టి సబబులేదు. ఔచిత్యము కూడా లేదని ధృవపడుచున్నది. అట్టి అర్థరహితమైన ప్రకటనను మన సనాతనులకు తెలియక చేసినారని విస్మరించవలెనా ! లేక అందులోగల గర్భితమైన సత్యమును తెలిసికొని వారియొక్క ఔన్నత్యమును కొనియాడవలెనా ? నిర్ణయించుకొనెదము. ప్రతిపదమునకు సామాన్యార్థము, విశేషార్థము అంతరార్థము ప్రత్యేక సందర్భోచిత అర్థములు ఉండును. నిఘంటుకారులు మనకు ప్రతిపదమునకు గల నానార్థములను అందించియున్నారు. సందర్భమును బట్టి దాని నానార్థములలో సరిపడు అర్థమును స్వీకరించి అన్వయించవలెనుగాని, తనకు తోచిన సంకుచిత నిర్వచనమును ఆపాదించి, అసంబద్ధమని త్రోసిపుచ్చరాదు మన పూర్వులు ఏది ప్రవచించినా సార్వజనీనమేగాని, సంకుచిత తత్త్వమునకు ఎంత మాత్రము తావులేదు ఇచట కేశవ శబ్దమునకు కేశములు కలవాడుగా సమన్వయించవలెను. కేశములు అనగా సామాన్యార్థకమైన తలవెంట్రుకలు అని భావించరాదు కేశములు అనగా కిరణములు అని సముచితార్థముగా అన్వయించవలెను అందువలన 'కేశవుడు' అనగా విష్ణువు కాదని, కేశములు కలవాడని, కేశములు అనగా కిరణములు అని రూఢి అర్థము చెప్పగా కిరణములుగల ప్రత్యక్ష దైవములు యావత్ చరాచర జగత్తుకు, అన్ని మతముల వారికి, అన్ని పంథీయులకు సూర్యచంద్రులే గోచరించవలెను. సూర్యచంద్రులను తిరస్కరించే మతమేమియును లేదు వారలు యావత్ మానవజాతికి ప్రత్యక్ష దైవములు. సూర్యచంద్రులను చూసి వారి కిరణ ప్రసారముతో జీవించని, ఆనందించని జీవజాతియే లేదు. అందువలన ఎవరు ఏ దేవతకు నమస్కరించినను సూర్యచంద్రులకే చెందునని చెప్పే సమన్వయార్థమే పైన వివరించిన వాక్యమునకు సరి అయిన అర్థం కాగలదు అందుచేతనే మన పూర్వ ప్రముఖ కవి తన కావ్యములో సూర్యుని గురించి ఈ విధము ప్రస్తుతించినాడు. " ఒక సూర్యుడు సమస్త జీవులకు తానొక్కొక్కడై తోచు పోలిక " అని వర్ణించినాడు. అందువలన బాహ్యపదమునకు అంతరార్థము గ్రహించినచో ఎంతయో సహనము, తృప్తి, సద్భావన పెంపొందగలదు.



మే 1995
సంపుటి : 11
సంచిక : 5

శ్రీవాణి
సాంస్కృతిక మాసపత్రిక
సంపాదకుడు-కొమరగిరి కృష్ణమోహనరావు

మేనేజర్
కొమరగిరి చంద్రశేఖర్
24-52, రామానాయుడు పేట
మచిలీపట్నం - 521 001
ఫోన్ : 22818

విడి ప్రతి : రు. 4-50
సంవత్సర చందా: రు. 54-00
4 సం॥ల చందా : రు. 200-00
జీవిత సభ్యత్వం : రు. 600-00
పోషకులు : రు.1,116/-

Cheques Drafts should be drawn in favour of SREE VANI, Monthly Machilipatnam

EDITED, PRINTED & PUBLISHED BY
**Komaragiri Krishna Mohan Rao**

Printed at
SREE VANI PRINTERS
MACHILIPATNAM
Phone : 21137

Despatched on 8-5-1995

## విషయసూచిక



ముఖచిత్రం : జగద్గురువు శ్రీ ఆదిశంకరాచార్య



# యుగములు కాదు హృదయములు పరిశుద్ధం గావించుకోవాలి !

—భగవాన్ సాయి దివ్య సందేశం

' మానం హిత్వా ప్రియో భవతి
క్రోధం హిత్వా న శోచతి
కామం హిత్వా న భవతి
లోభం హిత్వా సుఖీభవేత్ '

ప్రేమస్వరూపులారా !

అహంకారం లేని మానవుని అందరూ ప్రేమిస్తారు. క్రోధం లేనటువంటి వానికి దుఃఖమనేటటువంటిదే కనిపించదు. కోరికలు లేనటువంటివానిని ఏ దుఃఖములు వెంటాడవు. లోభం లేనటువంటివానిని నిరంతరం సుఖింపజేస్తుంది ఈ జగత్.

ప్రపంచం ఈనాడు అనేక సమస్యల నెదుర్కొంటు న్నది ఒక వైపున యుద్ధ భీతి, మరొక వైపున కరువు కాటకాల భయం మూడవ వైపున అధికార వాంఛ. నాల్గవ వైపున స్వార్థపరత్వము, మనిషికి మనిషికి మధ్య ద్వేషం, జాతికి జాతికి మధ్య వైరము. దీనికి కారణ మేమిటి ? నైతికత్వాన్ని విస్మరించి, మానవత్వాన్ని మరచిపోవటం చేత, సమాజంలో అనేక సమస్యలు ఈనాడు కొరగాని కొయ్యగా తయారైనాయి.

దురాశ, భయము, క్రోధము— ఈ మూడూ వున్న మానవుడు ఏ చిన్న కార్యమునందును విజయాన్ని సాధించలేడు. 1. దురాశ : కోరికలనేటటువంటివి మానవుని భ్రష్టుంగదీస్తాయి. కోరికలు వుండవచ్చును, కాని పరిమితమైన కోరికలు వుండాలి ఇవి మితిమీరి పోవటంచేత మానవుని గతికూడా దారి తప్పుతున్నది. ఈనాటి శత్రువు రేపటి మిత్రుడు కావచ్చు, నేటి మిత్రుడు రేపు శత్రువు కావచ్చు కాని కోరిక నిరంతరమూ శత్రువే. ఇది మానవుని వెంటాడుతూ ఉంటుంది కోరిక నిత్య శత్రువు ఈ కోరికలనేవి మానవునకు ఆనందాన్ని అందిస్తున్నాయి. దుఃఖమునూ చేకూరుస్తున్నాయి. కనుక ఈ కోరికలను మనం అదుపులో పెట్టుకోవటానికి ప్రయత్నించాలి. మానవుడు ఈనాడు అనేక అశాంతులకు గురియైపోతున్నాడు, అనేక దుఃఖములకు బలియైపోతున్నాడు. దీనికి కారణ మేమిటి ? అసలు దేహాభిమానమే దుఃఖము. దేహ మునే 'నేను' అనుకోవటం దుఃఖం. 'నేను, నాది' — అనే రెండు పదములే మనకు దుఃఖమును అందిస్తు న్నాయి. 'నేను' అనేది అహంకారము 'నాది' అనేది మమకారము. "అహంకార మమకారములే మానవుని అనంత దుఃఖమునకు మూలకారణము" కనుక దేహాభిమానమును కొంతవరకు తగ్గించుకోవ టానికి కృషి చేయాలి. మనసును అదుపులో వుంచు కోవాలి వేగముగా వెళ్ళే రైలును లక్షలాదిమంది ప్రజలు పట్టుకున్నా నిలువదు. కాని ఇంజన్ రూము లోని ఒక చిన్న బ్రేకును నొక్కితే రైలంతా నిలిచి పోతుంది అదేవిధముగా సమస్త దుఃఖములకు మూల కారణమైన మనసును అదుపులో వుంచుకుంటే సమస్త దుఃఖములూ పరిహారమైపోతాయి.

దేదీప్యమానంగా ప్రకాశించేటటువంటి సూర్యుని దట్టమైన మేఘములు కప్పినప్పుడు సూర్యుడు కనిపించక అంధకార బంధురమై పోతుంది గాలి వీచినప్పుడు మేఘములు పైదొలగి స్వప్రకాశుడై సూర్యుడు కనిపిస్తాడు. ఆ దేవిధముగ, మానవుని హృదయమునందు దేదీప్యమానంగా ప్రకాశించేటటువంటి ఆత్మ వుండి నప్పటికినీ, అభిమాన మమకారము లనేటటువంటి వాంఛలు దట్టమైన మేఘములవలె కప్పి ఈ ఆత్మ తత్త్వాన్ని మరుగుచేస్తున్నాయి ప్రేమ మారుతమనేది వీచినప్పుడు ఈ అహంకార మమకారములు తొలగి ఆత్మతత్త్వమనేటటువంటి జ్యోతిని మనకు అందిస్తుంది.

( తరువాయి 2? వ పేజీలో )

# భగవంతుడు భారతావనిలో అవతరించాడు

శ్రీ ఆర్. కె. కరంజియా సుప్రసిద్ధ 'బ్లిట్జ్' పత్రికా సంపాదకుడు వయస్సు 83 సం ప్రసిద్ధమైన పండ్రెండు గ్రంథాలను రచించారు. నెహ్రూ, నాజర్, కృశ్చేవ్, కాస్ట్రో, చూఅన్‌లై, అరాఫత్, షా ఆఫ్ ఇరాన్ మున్నగు ప్రపంచ ప్రఖ్యాత పురుషులను ఇంటర్వ్యూ చేసిన మేటి నిర్భీకతతో వ్రాసెడి తన వ్యాస రాజములతో తన పత్రిక పాఠకలోకాన్ని సుమారు మూడు మిలియన్లకు పెంచగలిగాడు.

1976 సం.లో శ్రీసత్యసాయిబాబావారి వ్యతిరేకులుగా ఒక తుఫాను సృష్టించగా, కరంజియాకు శ్రీ బాబా వారిని రెండున్నర గంటలు ఇంటర్వ్యూ చేసెడి మహదావకాశం లభించింది ఇంటర్వ్యూ సమయంలో, కరంజియా స్వామివారిని అనేకానేక ప్రశ్నలకు గురిచేసి సమాధానములను పొందగలిగాడు. స్వామివారు అనిన నమ్మకంలేని వారల ప్రతినిధివలె స్వామివారిని ప్రశ్నించాడు

శ్రీ బాబావారు తనకుగల ప్రత్యేకమైన ఆత్మవిశ్వాసంతో, సత్యనిరూపణార్థమై వివరముగ సమాధానము లను కరంజియాకు అందించారు. 'మీ ప్రశ్నలకన్నింటికిని, సాయిబాబా సమాధానములు ఇందున్నవి' అన్నట్లుగ 'God Lives in India' అను గ్రంథాన్ని కరంజియా రచించారు.

విశేషమేమిటంటే మార్క్సిస్టు భావాలు కలిగి, తార్కికుడైన సందేహాత్ముడైన కరంజియా బాబావారిని దర్శించి, నిసితముగ ప్రశ్నించి సమాధానముల నెరిగి బాబావారిని చివరకు విశ్వసించి మంచి గ్రంథమును ప్రశ్నోత్తర రూపమున వెలువడజేయటం నిజముగా విస్మయకరం.

ఆనాడు వివేకానందుడు కూడ పరమహంసను ' నీవు నాకు దేవుని చూపగలవా ? ' యని ప్రశ్నించి, తుదకు పరివ్రాజకుడై పాశ్చాత్యదేశములలో భారతీయ వేదాంతమును ప్రచారము చేసిన రీతి కరంజియా, బాబావారి కలయిక జ్ఞప్తికి చేయుచున్నది.

ఈ సద్గ్రంథాన్ని తెనుగున అనువదించుటకై అనుమతి అభ్యర్థించగనే అంగీకారము తెల్పిన శ్రీ ఆర్. కె కరంజియాగారికి మా కృతజ్ఞతలు ప్రశ్నోత్తర రూపమున శ్రీ బాబావారి మహనీయ భావము లను వెలువడజేసిన ఈ గ్రంథమును శీర్షిక రూపమున 'శ్రీవాణి' లో ప్రతినెల ప్రచురించెదమని పాఠక లోకమునకు తెల్పుటకు సంతసించుచున్నాము

– సం.

శ్లో॥ తీక్ష్ణాంత స్త్రీకటాక్ష క్షతహృదయతయా వ్యక్తసంసక్తరక్తాః
క్రోధాది క్రూర రోగ వ్రణ గణ గణనానీత తీవ్రవ్యథార్తాః
స్నేహక్లేదాతిలగ్నైః కృమిభిరనుసుతైః స్వాంగజైర్భక్ష్యమాణాః
సంసార క్లేశశయ్యానిపతిత తనవః పశ్యసీదంతి మందాః ॥

# అమృతవాణి

## మాచిభట్ల చంద్రశేఖరశర్మ

సంసారం సాగరం లాంటిది. కనుక దరిచేరలేక సతమతమౌతుంటారు మనుష్యులు. బాధల మయమైంది సంసారం దీన్ని క్లేశశయ్య అన్నారు కొందరు పెద్దలు అంటే బాధలన్నీ కలిసి మనిషి పడుకోనేందుకేర్పడిన అందమైన పక్కయే సంసారం ఈ పక్కమీద పడుకోక తప్పదు. పడుకున్న తర్వాత బాధలను అనుభవించక తప్పదు ఆ బాధలేమిటంటారా?

ముందు స్త్రీతో ప్రారంభమవుతుంది బాధ ఆమె తీక్షణమైన కనుకొనల చూపులు హృదయంలో గ్రుచ్చుకుంటాయి అయితే ఇది తీయని బాధ కనుక ఒడలు తెలీదు అందువల్ల అనురక్తులవుతారు మనుషులు. నిజానికిది రక్తి అందామా లేక రక్తమే అందామా చెప్పండి.

ఇక కామ క్రోధాలున్నాయే అవేమిటనుకుంటున్నారు? అవి ఆరు విధాలయిన రోగ వ్రణాలు ఇవి ఒక పట్టాన మానేవి కావు ఎన్ని మందులు పుచ్చుకొన్నా తాత్కాలికంగా మానుపట్టినట్లే కనబడతాయి కాని మధ్య మధ్య సెలేస్తుంటాయి. ఆ పచ్చిదనం ఎన్నటికీ పోదు. ఏది పచ్చిగా వుందో ఏ గాయం మానుపడుతుందో, ఇంకా ఏం మందు వేయాలో రోజూ ఈ గాయాలను లెక్క వేసుకుంటూండాలి. దాన్నిబట్టి మందు వాడాలి. రోజూ తుడిచి ఒక్కొక్కటి మందు వేస్తుంటే పడే బాధ యింతా అంతా కాదు ఇలా బాధలనుభరిస్తూంటారీ జనులు.

ఇన్ని మందులు వేసుకుంటున్నా క్రిములు దిట్టంగా ఆ పుండ్లను పట్టి లుకలుకలాడుతూంటాయి క్రిములంటే వేరేలేవు అవి తన సంతానమేనట మరి తల్లిదండ్రులకు తమ సంతానం మీద ఎనలేని ప్రేమ వాత్సల్యాదులుంటాయి కదా! అది సహజమే ఈ కొడుకులు కూతుళ్ళు తమ శరీరం నుండి పుట్టిన గాయాల్లాగానే పుట్టినవాళ్ళు కదా! ఆ గాయాల్లాగానే వీళ్ళూ బాధ పెడుతుంటారు అయితే వీళ్ళమీద వున్న ప్రేమాతిశయం పెద్ద బంధమైపోతుంది ఇదే వాసనంటే ఈషణాత్రయంలో ఇదొకటి పుండ్లనుంచి కూడా వాసనవస్తుంది. వాటి నుంచి చీము నెత్తురు కారుతూంటే భరించరాని దుర్వాసన బయలుదేరుతుంది ఆ పుండ్లను క్రిములు తిన్నట్లు పుత్రాదులు కూడా ఒక విధంగా తల్లిదండ్రుల్ని తింటూంటారు ఇవి ఎప్పటికి నయమయ్యేను? ఈ బాధ లెప్పటికి తీరేను?

ఇదెన్నటికీ యింతే అసలు సంసారశయ్యమీద పడుకోనేకూడదు. పడుకున్న తర్వాత ఆ పక్క సుఖావహంగా కనబడుతున్నా ఇదిగో చివరికి బాధలు ఇలా వరుసగా పుట్టి ఏడిపిస్తుంటాయి.

అందుకని మందబుద్ధికలవారు అంటే వివేకహీనులు ఈ సంసార క్లేశశయ్యమీద తమ శరీరం వాలుస్తారట! బాధలనుభవిస్తారట!

ఇహ సంసారే బహుదుస్తారే.

# ఆదిశంకరులు శ్రీ జగద్గురు శంకరాచార్య

భరద్వాజ్

" అష్టవర్షే చతుర్వేదీ
ద్వాదశే సర్వశాస్త్రవిత్
షోడశే కృతవాన్ భాష్యం
ద్వాత్రింశే మునిరభ్యగాత్ "

ఎనిమిదేండ్లకే చతుర్వేద ( నాలుగు వేదములు ) విదుడయ్యెను పండ్రెండేండ్ల ప్రాయముననే సర్వ శాస్త్ర పారంగతుడయ్యెను పదునారేండ్లకే బ్రహ్మ సూత్రాలను భాష్యం చెప్పెను. ముప్పది రెండు సంవత్సరములకే మునియై అవతారమును చాలించెను ఇదే ఆదిశంకరులు జగద్గురు శంకరాచార్యులవారి జీవిత సంగ్రహం

భారతదేశంలో నాస్తికవాదం తీవ్రరూపం దాల్చి, హిందూధర్మ సంస్కృతీ పరంపరలను తూలనాడుతున్న దుర్దినాలలో ఒక ' జ్ఞానభాస్కరుడు ' ఉదయించాడు జ్ఞానశూన్యులై అజ్ఞానాంధకారంలో పయనిస్తున్న ప్రజానీకానికి దివ్యజ్యోతిని ప్రసాదించాడు ఆత్మ విస్మృతి జెంది నిద్రాణమైయున్న జాతిలో నవ చైతన్యాన్ని కలుగజేసి, హిందూమతము యెడల ప్రగాఢమైన విశ్వాసాన్ని పునః ప్రతిష్ఠించాడు ప్రయాణ సౌకర్యములు లేకపోయినా, రాజాదరణలు లభించకపోయినా, నిరుత్సాహమును దరికి చేరనీయకుండా, ఆత్మ విశ్వాసంతో, అకుంఠిత దీక్షతో, ఆసేతుహిమాచల పర్యంతం పరివ్రాజకుడై, కాలినడకన పర్యటించి జాతిని జాగృతం చేసి తేజోవంతంచేశాడు. ఆ యుగపురుషుడే ఆదిశంకరులు శ్రీ జగద్గురు శంకరాచార్య

వారి జన్మస్థలం కేరళలోని 'కాలడి'. తల్లి ఆర్యాంబ, తండ్రి శివగురువు. ఆ మహనీయుని అవతరణ ఒక మంగళ ముహూర్తం. అది నందననామ సంవత్సర వైశాఖశుద్ధ పంచమి ఆదివారం, పునర్వసు నక్షత్ర శుభసమయం. కలిశకానుసారము అది 25 3 వ సంవత్సరం అనగా క్రీ పూ. 50? వ సంవత్సరం. వీరికి చేయోపనయనాదులు యథాకాలంలో విధివిధానంతో నిర్వహించబడినాయి. మధూకర వృత్తితో నియమ పూర్వకంగా, గురుసాన్నిధ్యంలో చతుర్వేదాధ్యయనం శ్రద్ధతో చేశారు శంకరులవారు ఆ సమయంలోనే వీరు ఒక బీద బ్రాహ్మణ గృహిణి వలన "ఆమలక" భిక్షను స్వీకరించి, శ్రీ మహాలక్ష్మిని "కనకధారాస్తవం" తో స్తోత్రం చేయగా, ఆమె గృహ పరిసరమంతటా, సువర్ణామలక వృష్టి కురిసిందని చరిత్ర చాటుతున్నది.

ఒకనాడు శంకరులవారి తల్లి, వృద్ధాప్యంవల్ల నిత్యము చేయు స్నానము చేయలేకపోవటం చూచి. నదీప్రవాహపుజాలునే త్రిప్పి తన ఇంటి ప్రక్కగా పారునట్లు చేశారట. శంకరులవారు, తల్లితో కలిసి ఆ 'చూర్ణి ' నదిలో స్నానము చేయుచుండగా, ఒక నదిలో స్నానము చేయుచుండగా, ఒక మొసలి శంకరుని కాలు పట్టుకొని నదిలోనికి ఈడ్చుకొనిపోవుచుండగా ' అమ్మా ! నన్ను మొసలి ఈడ్చుకొని పోవుచున్నది. సన్యాసం స్వీకరించడానికి అనుమతి యిస్తే, వదలి వేస్తుంది లేకపోతే తీసుకొనిపోతుంది. నీకు పుత్ర కృత్యము చేయువారుండరు. సన్యాసమునకు అనుమతి యిస్తే దుర్మరణం తప్పుతుంది. నీతోపాటు ఇరువది ఒక్క తరములవారు కూడా తరించుదురు' అని కేకలు పెట్టగా, పిల్లవాడు బ్రతుకుతే అంతేచాలునని సన్యాసం స్వీకరించడానికి తల్లి అంగీకరిస్తుంది. తల్లికడ శలవు తీసుకొని పరివ్రాజకుడై నర్మదా నదీ తీరాననున్న

గోవింద భగవత్పాదులవారి వద్దకు వెళ్ళి, తనను తానే పరిచయం చేసుకొని "శివః కేశవోఽహం" అనే మకుటంగల దశశ్లోకిని చెప్పి "గోవిందం పరమానందం, మద్గురుం ప్రణతోస్మ్యహం" అని ప్రణామం చేస్తారు. అప్పుడు శంకరులవారు వ్రాసిన 'భజగోవింద స్తోత్రం' గురుపరముగను, దైవపరముగను వెలయుచున్నది. అప్పుడు శ్రీ గోవింద భగవత్పాదులవారు ఆనందంతో అనుగ్రహించి శంకరుని శిష్యునిగా స్వీకరించి మహావాక్యోపదేశాన్ని చేసారు.

గురువాజ్ఞ ప్రకారం శంకరులవారు కాశీపట్టణానికి వెళ్ళారు. అది మహాపండితుల నిలయం పదునారు వత్సరాల ప్రాయంలో దేదీప్యమానంగా వెలిగిపోతున్న ఆ బ్రహ్మచారి బ్రహ్మ తేజస్సును చూచి పండితులంతా తలలొంచి మోకరిల్లుతారు. అచటనే వీరు బ్రహ్మసూత్రములకు, ఉపనిషత్తులకు, భగవద్గీతకు భాష్యాలు రచించారు. వీటికి "ప్రస్థానత్రయ భాష్యములు" అని పేరు. వీరిచే "సనత్సుజాతీయ భాష్యం" ఇచటనే రచించబడింది "మనీషా పంచకం" కూడా ఇచటనే చెప్పబడింది. వారితో అక్కడ బ్రహ్మసూత్ర భాష్యంలోని "తరంతర ప్రకరణం" పై గోష్ఠి జరిగింది వీరికి అక్కడ అనేకమంది శిష్యులైనారు వారిలో "సనందనుడు" ముఖ్యుడు ఆయనే 'పద్మపాదాచార్యులు' గా ప్రసిద్ధులయ్యారు తరువాత 'హస్తమలకాచార్యుల' ను శిష్యునిగా స్వీకరిస్తారు పిమ్మట 'ఆనందగిరి' ని శిష్యులుగా చేర్చుకుంటారు. వీరినే 'తోటకాచార్యులు' అని అంటారు తోటకవృత్తంలో శంకరులవారిని స్తోత్రం చేయటంవలన ఆనందగిరికి "తోటకాచార్యులు" అని పేరువచ్చింది తుదకు 'సర్వేశ్వరుల' ను శిష్యులుగా పరిగ్రహిస్తారు. వీరి పూర్వాశ్రమనామం 'మండన మిశ్రుడు' వీరు శంకరుల వారితో వాదన సలిపి వారి జ్ఞానమార్గమును అంగీకరించి శిష్యులై వీరి ధర్మపత్ని 'సరసవాణి' (ఉభయభారతి)తో ఎంతో క్లిష్టమైన శాస్త్ర చర్చలు జరిపి ఆమెను జయించుతారు ఆమె సరస్వతీ అవతారమని ప్రతీతి.

ఆదిశంకరులు భారతవర్షమంతా రెండుపర్యాయములు విజయయాత్ర చేస్తారు మొదటి పర్యాయం బౌద్ధ జైన మతాలవల్ల మితిమీరి ప్రబలిన నాస్తిక భావాలను ఖండించి అద్వైత జ్ఞానమును ప్రబోధిస్తారు రెండవ పర్యాయం సుప్రసిద్ధ పుణ్యక్షేత్రములను సందర్శించి, జీర్ణావస్థలో నున్న వాటిని పునరుద్ధరించి, వాటి ప్రాశస్త్యమును గురించి అనేక పుస్తకాలు వ్రాస్తారు కైలాసానికి వెళ్ళి సదాశివుణ్ణి 'వేదాంత చూర్ణిక' తో స్తోత్రం చేసి, అచట నుండి ఐదు స్పటిక లింగములను : శాస్త్రపరము, మంత్రశాస్త్ర సమ్మతము ఐన 'సౌందర్యలహరి' అనే గ్రంథము (ఇందు ఆనందలహరిని మాత్రం) ను భువికి తీసుకొనివస్తారు కైలాసము నుంచి తెచ్చిన స్పటిక లింగాలలో భోగలింగాన్ని శృంగేరిలో, మోక్షలింగాన్ని

చిదంబరంలో, వరలింగాన్ని నేపాలంలో, ముక్తి లింగాన్ని కేదారంలో, ఐదవలింగాన్ని కంచిలో ప్రతిష్ఠించారు. శ్రీరంగంలో 'జనాకర్షణ' యంత్రమును, తిరుమలలో 'ధనాకర్షణ' యంత్రమును ప్రతిష్ఠించారు. జంబుకేశ్వరంలో గణపతిని ప్రతిష్ఠించి, అఖిలాండేశ్వరీదేవి ఉగ్రరూపమును తగ్గించి శాంతింపజేసారు.

కన్యాకుమారి నుండి కాశ్మీరం వరకు, ఇటు మహోదధి నుండి అటు రత్నాకరం వరకు పర్యటించి నాలుగు మూలల నాలుగు మఠాలను నెలకొల్పారు. తుంగభద్రా తీరమున శృంగేరీ మఠమును స్థాపించి, శక్తిస్వరూపిణిగా 'శారదాదేవి' పేరుతో సరస్వతిని ప్రతిష్ఠించారు. దానికి తమ శిష్యులైన 'పృథ్వీధరు'లను మఠాధిపతిగా నియమించారు. ఉత్తరాన బదరీనారాయణంలో 'జ్యోతిర్మఠాన్ని' స్థాపించి 'తోటకాచార్యుల'ను అధిపతుల్ని గావించారు. పశ్చిమాన ద్వారకామఠమును స్థాపించి, 'హస్తమలకాచార్యుల'ను అధిపతులుగా చేసారు. తూర్పున మహోదధి తీరంలో పూరీగోవర్ధన మఠమును స్థాపించి దానికి 'పద్మపాదాచార్యుల'ను అధిపతులను చేసారు. అంతేకాక కాశీలో 'సుమేరు' లేక 'పాదుకా' పీఠాదులను ప్రతిష్ఠించారు. కంచిలో కామకోటి పీఠమును కూడా శంకరులవారే నెలకొల్పారు. ఇంకా అనేక పుణ్యక్షేత్రములను దర్శించి, యంత్రప్రతిష్ఠలు చేసి, అచటి దివ్య తేజస్సును దేదీప్యమానం చేసి, భారతదేశ సమైక్యతను, సమగ్రతను పరిరక్షించి, ప్రజల్లో చైతన్యాన్ని కలుగజేసిన మహనీయులు, మహాప్రవక్త అయిన ఆదిశంకరులు తన 32 వ ఏట అనగా క్రీ. పూ 477 సం. లో అవతారమును చాలించారు. ఈ మహనీయుని చరిత్ర మనకు అత్యంత పవిత్రమైనది, చిరస్మరణీయమైనది ○

– ఎన్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

## తాటిచెట్లుకు ఉపన్యాసం

అవి మన దేశానికి స్వతంత్రం రాక పూర్వం రోజులు. చీరాలకు దగ్గరలో వుండే పేటపాలెం అనే గ్రామంలో బ్రిటిష్ ప్రభుత్వం పంచాయితీ కోర్టును ఏర్పాటుచెయ్యాలనుకున్నారు. కాని ఇది ప్రజలు వ్యతిరేకించారు

కాని కొంతమంది గ్రామంలోని పెద్దలు ప్రభుత్వానికి భయపడి సభకి హాజరైనారు. వాళ్ళని చూసి కొంతమంది జనం కూడా వెళ్ళారు

ఈ విషయంలో వ్యతిరేకతను తెలియజేయడానికి ప్రజలకు నాయకత్వం వహిస్తున్న వ్యక్తి అక్కడికి వచ్చాడు. ఆ సమావేశాన్ని చూసి ఆశ్చర్యపడ్డాడు. ప్రభుత్వోద్యోగులు ప్రజానాయకులను కొందరిని భయపెట్టి వుంటారని గ్రహించాడు

వెంటనే ఆ ప్రజానాయకుడు ఆ ప్రదేశానికి ప్రక్కనే యున్న తాటితోపు లోనికి వెళ్ళాడు. చెట్టు మీదికి లేచివున్న తాటిచెట్లను చూశాడు. అక్కడ మనుష్యులెవ్వరూ లేరు. అతను ఆ చెట్లనుద్దేశించి "నోరు లేకపోయినా నిజాయితీకి నిలబడే వారంటే మీరు. పిరికితనంతో జనులు తమ ప్రతిజ్ఞలు వదిలేసి ప్రభుత్వానికి లొంగిపోయారు. ఎవరికి లొంగకుండా మీదికి అంటే స్వర్గం వైపే చూస్తూ నిలబడ్డ మీరు ఎంతో మేలు. మనుషులకు గౌరవ మర్యాదలు తెలియదు. సిగ్గు అసలు లేనేలేదు. మనుషులలో బానిస భావాలు పోవు'' అని గట్టిగా ప్రసంగిస్తున్నాడు. ఆ ప్రక్కనేవున్న ప్రదేశంలోని ప్రజలు యిదంతా వింటున్నారు. ఆ నాయకుడు తమ గురించే ఆ విధంగా ప్రసంగిస్తున్నాడని గ్రహించి సిగ్గుపడి ప్రభుత్వ సమావేశాన్ని విడిచి అతని చుట్టూ చేరారు. వారికి ధైర్యం చేకూరేటట్లు దీర్ఘమైన ఉపన్యాసం ఇచ్చాడు ఆ నాయకుడు. అక్కడ పంచాయితీ కోర్టుకు ఎన్నిక ఆగిపోయింది. అక్కడ జనం లేకుండాపోయారు.

దీనికి కారణమైన ఆ ప్రజానాయకుడు ఆంధ్రరత్న అని పేరు పొందిన శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్య. ●

# దేశాభిమానం

- సోమంచి రామం

" జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి " - అన్నది ఆర్యోక్తి! కన్నతల్లి, కన్నఊరు స్వర్గం కన్న మిన్న. మాతృదేశాన్ని గౌరవించడం మనిషి కర్తవ్యం, ధర్మం మాతృప్రేమ ఎంత స్వతఃసిద్ధమో మాతృదేశభక్తి కూడ అంతే సహజము.

మాతృదేవత వినత దాస్యవిముక్తి కోసం అమృతాన్ని సాధించి తెచ్చిన గరుత్మంతుడు ధన్యజీవి. భరతమాత దాస్యవిముక్తి కోసం మహాత్ముని వంటి మహనీయులెందరో త్యాగాలు చేశారు భగత్‌సింగ్ వంటి వీరులెందరో ప్రాణాలు అర్పించారు పరపాలనలో మ్రగ్గుతున్న భరతమాత దాస్యశృంఖాలాలను ఛేదించి, దేశస్వాతంత్ర్య సాధనకు సహకరించినవారందరు దేశభక్తులు, దేశాభిమానులు దేశరక్షణకోసం ప్రాణత్యాగం చేసినవారు ధన్యులు.

" మాతృదేశము మాట ముచ్చట, మదము గూర్చదు మదికి ననియెడి పరమ నీచుడు ధరణినంత గలయ వెదకిన గాననగునా ? "- అంటారు కాళోజి నారాయణ రావుగారు

మాతృదేశస్తవము చేయనివారు పరమ నీచులు, దేశద్రోహులు కనుకనే, " ఏ దేశమేగినా ఎందు కాలిడినా, ఏ పీఠమెక్కినా, ఎవ్వరేమనినా, పొగడరా నీ తల్లి భారతిని, నిలుపరా నీ జాతి నిండు గౌరవము " అని గానం చేశారు ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు

అయితే మాటలలో మాతృదేశాన్ని పొగిడినంత మాత్రాన, దేశానికి ఒరిగేదేమీయు ఉండదు అందుకనే

" దేశాభిమానం నాకు కద్దని,
వొట్టి గొప్పలు చెప్పుకోకోయ్!
పూని ఏదైనాను వొక మేల్
కూర్చి జనులకు చూపవోయ్ ! "

అంటూ హెచ్చరించారు గురజాడవారు.

దేశానికుపకరించే మంచి పనిచేయడమే, దేశాభిమానము, దేశసేవ, అన్నది వేరుగా ఎక్కడా ఉండదు.

" దేశమంటే మట్టి కాదోయ్, దేశమంటే మనుషులోయ్ "- అన్న గురజాడవారి మాట ప్రకారం, దేశంలోని మనుషులకు చేసే సేవే, దేశసేవ. అదే దైవసేవ, మానవసేవే మాధవసేవ అన్న సూక్తిలోని పరమార్థం అదే !

శత్రుబారినుండి మాతృదేశ రక్షణ ప్రతి మనిషి కర్తవ్యం శత్రువులతో యుద్ధము చేసేందుకు సైనికులెల్లప్పుడూ సంసిద్ధులుగానే ఉంటారు. ప్రాణాలకు తెగించి, పోరాడి దేశస్వాతంత్ర్యాన్ని పరిరక్షించే, వీరజవాన్ల సంరక్షణ ప్రజల బాధ్యత. అయితే ఈనాడు చాలామంది 'దేశం మాకేం చేసింది'- అంటూ ప్రశ్నిస్తున్నారు. అలాటి వారంతా 'దేశానికి తామేంచేశామని' ముందుగా ప్రశ్నించుకోవాలి దేశాభివృద్ధికి దోహదపడే ఏ చిన్న కార్యమైనా చేయడం ప్రతి పౌరుని కనీస ధర్మం,కర్తవ్యం అదేవిధంగా దేశాభివృద్ధి నాటంకపరచే శక్తులను ప్రతిఘటించడం, అరికట్టడం, అంతేఅవసరం.

అవినీతి, లంచగొండితనము, బ్లాక్‌మార్కెటింగు, స్మగ్లింగు, మొదలైన కార్యకలాపాలన్నీ దేశవిద్రోహచర్యలే ! ఇట్టి చర్యలకు పాల్పడేవారెవరైనా దేశానికి చీడపురుగులు, దేశద్రోహులు ! ఇట్టి వారిని ఒక కంట కనిపెట్టాలి !

దేశభక్తిని ప్రబోధించే గీతాలను, పాటలను, ఉపన్యాసాలను, విద్యార్థులకు చిన్న తరగతులనుంచే నేర్పాలి. దేశనాయకుల జీవితచరిత్రలోని ముఖ్య ఘట్టాలను బోధించాలి దేశము యొక్క ఔన్నత్యము, గొప్పతనము అర్థమయేలా తెలియచెప్పాలి దేశంపట్ల వారికిగల బాధ్యతలను గుర్తించేలా శిక్షణ నీయాలి. దేశ సంకేతాలైన జాతీయగీతాన్ని, జాతీయ పతాకాన్ని గౌరవించడం అలవర్చాలి. ప్రాణాలకన్న దేశ గౌరవమే మిన్నయన్న భావం కలిగించాలి జాతీయ సమగ్రత, సమైక్యతల సంరక్షణయే దేశాభిమానం ◯

# వర్రీ.. వర్రీ... వర్రీ...

-పాతూరి ప్రసన్నం

టెన్షన్ నిప్పురవ్వ వంటిది దానికి చోటిచ్చామా అది రగిలి రగిలి పెరుగుతూ వుంటుంది రగలటాన్నే 'చింత' అంటారు 'చితి' అనేది మాత్రం దేహాన్నే కాల్చుతుంది చింత అనేది సజీవమైన మానవుణ్ణి, లోలోపల దహించివేస్తూ వుంటుంది. కానీ ఎంతమంది ఈ చింత బారినుంచి తమకు తాము సంరక్షించుకుంటున్నారు? ''పుట్టుట ఒక చింత, భూమి నుండుట చింత, సంసారమొక చింత, చావు చింత.... చింత లేనిదెపుడు యిహ జీవితంబున?'' అని ప్రశ్నిస్తారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు. ఇదే దుఃఖంగా అనుభవింపబడుతుంది. బయటకు పొంగి వచ్చే దుఃఖాన్ని ఒక అగ్నిజ్వాలగా పోల్చవచ్చు. 'వర్రీ' అనే యింగ్లీషు మాటకు 'చింత' అనే పదాన్ని అర్థంగా చెప్పవచ్చు. Spark neglected- burns the house అనే టాల్‌స్టాయి కథ ఒకటి వుంది. అలాగే టెన్షన్ అనే నిప్పురవ్వను మొదట్లోనే ఆర్పివేయాలి లేకపోతే అది ఒక చింతగా చిచ్చును రగుల్చుతుంది. అదే దుఃఖంగా భగ్గుమంటుంది.

ఇది చాలా సున్నితమయిన సమస్య. 'చింతించకు' 'దుఃఖించకు', 'విచారించకు' (Don't Worry), (Don't Weep) (Don't Feel Sorry) అని చెప్పటం తేలికే. ''మాశుచః'' (విచారించకు) అని భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్ముడు అర్జునునితో కూడా అంటాడు 'మాభీః' అంటుంది (భయపడకు) వేదం. అలా అనటమే కాకుండా విచారించని స్థితి ఎలా వుంటుందో, భయపడకుండా ఎలా బ్రతకాలో కూడా వారు చెప్పారు ఈ రోజుల్లో మనం ఈ మాటలనే ఎవరితోనైనా అంటే ఏమని సమాధానం చెబుతారో మనకు తెలుసు "నా స్థానంలో నీవు వుంటే నీకు తెలుస్తుంది, నేనెందుకు విచారించేదీ'', అంటారు వారు.

''నేనెప్పుడూ దేనికీ విచారించను, అలా విచారించవలసి వచ్చే పరిస్థితులను సృష్టించకుండా వుండే రీతిగా ప్రతి ఆలోచననూ, ప్రతి మాటనూ, ప్రతి చేతనూ చేస్తూవుంటారు ఒకవేళ విపరీత పరిస్థితులలో అననుకూలత సంభవించినా కూడా, దాన్ని చిరునవ్వుతో స్వీకరించి, సముచితమైన నిర్ణయాన్ని తీసుకొని, దానికి తగిన Action Plan (కార్యాచరణ పథకాన్ని) తయారు చేసి ముందుకు సాగిపోతాం. అసలు దేనికీ విచారించవలసిన అవసరం నాకు కనిపించదు. విచారించటం అనేది నా నిఘంటువులోనే లేదు'', అని ఒక పాజిటివ్ దృక్పథంతో ఈ వ్యాస రచయిత అంటూ వుంటాడు.

ఈ దృక్పథం అలవడటం అందరికీ సాధ్యమే !

## Never Mind, Don't Worry

తరచుగా 'నెవర్ మైండ్ - డోంట్ వర్రీ' అంటూ వుండగా వింటాం వర్రీ అనేది బాహ్యపరిస్థితులలో లేదు. అది మనస్సు తన మీద తనకు తాను వేసుకున్న బరువు వంటిది. కొన్ని పరిస్థితులలో హఠాత్తుగా మనస్సు చింతాక్రాంతమైపోతుంది వెంటనే 'అమ్మయ్య! ఏదో జరిగిపోయింది అనుకున్నాను, ఏమీ కాలేదు. మనస్సు తేలిక పడింది' అంటాం కాబట్టి మనకు తెలియకుండానే మనస్సు పైన భారం పడటం, తర్వాత ఆ బరువు మనస్సునుంచి తొలగిపోవటం మనకు

ప్రతినిత్యం అనుభవైక వేద్యమే. కానీ 'వర్రీ'కి గల మర్మాన్ని మాత్రం తెలుసుకోలేకపోవటం జరుగుతూ వుంటోంది వర్రీ పడటం, వర్రీని వదలటం ... ఇలా కాకుండా అసలు వర్రీని మనస్సు మీదికి తీసుకు రాకుండా బ్రతికితే, అదే నిజమైన ఆనంద జీవనం! అతనిదే సఫల జీవనం! అతనిదే విజయ సోపానాలను అధిరోహించే జీవనం Never Mind కు Opposite ఏమిటి? Mind for ever 1) మనస్సుకు పట్టించు కొనకు 2) ప్రతిదీ పట్టించుకో. మొదటి దాని ప్రతిఫలం వర్రీ లేకపోవటం, రెండవదాని ప్రతిఫలం వర్రీ చెందటం. మనస్సు యొక్క తత్త్వాన్ని విచారణ ద్వారా, Self-Analysis ద్వారా సుదీర్ఘ కాలంలో తెలుసుకొన గలిగితేగానీ నిజంగా NeverMind అనే మాటకు అర్థం తెలియదు. ఒక చిన్న ఉదాహరణ :-

ఒక వ్యక్తి వివిధమైన వ్యసనాలకు బానిసగా బ్రతుకుతున్నాడు. భార్యాబిడ్డల సంగతి పట్టదు. క్లబ్బులో రోజుల తరబడి చీట్లపేక ఆడుతున్నాడు. "నాన్నా! అమ్మకు సీరియస్‌గా వుంది", అంటూ పరిగెత్తుకొస్తూ అతని సుపుత్రుడు ఏడ్చాడు ఆస్పత్రికి తీసుకుపో" అని పిల్లవాణ్ని పంపించాడు తండ్రి. పేకముక్కలు వదలలేదు. కాస్సేపటికి పిల్లవాడు మరల వచ్చాడు. "నాన్నా! అమ్మ చచ్చిపోయింది". అన్నాడు ఏడుస్తూ శవాన్ని యిటునుంచే తీసుకువెళ్తారు కదా!" అన్నాడు తండ్రి కొడుకు ఏడుస్తున్నాడు తండ్రి యొక్క పశుత్వానికి! 'Never Mind బిడ్డా' అంటాడు తండ్రి.

తండ్రి పరమ మూర్ఖుడు. అతని మానవత్వంతో ఆలోచించే మనస్సే లేదు. కాబట్టి అటువంటివాడు Never Mind- Don't Worry అనే అర్హత, అధికారం కూడా అతనికి లేదు. దాన్నే Escaping-Philosophy అన్నారు.

మంచిచెడ్డలు, ఉచితానుచితాలూ విశ్లేషించగల మనస్సుకే 'Never Mind' అనేది సాధ్యం అవుతుంది.

'వర్రీ' అనేది గొంతును బలవంతంగా నులిపివేస్తున్నంతటి ప్రమాదం తెస్తుంది, గొంతును పిసికితే వూపిరి ఆడదు వర్రీ తెచ్చే అనర్థం కూడా అటువంటిదే! అంటారు మనస్తత్వ శాస్త్రజ్ఞులు.

అమెరికాలో ఒక సర్వే చేశారు. వారందరిదీ 50 సంవత్సరాల వయస్సే సగానికి సగంమంది హై బి పి, గుండెజబ్బు, అల్సర్‌లతో బాధపడుతున్నారు వారంతా ఎగ్జిక్యూటివ్ (Executive) అధికారులే! వారి రోగాలకు మూలకారణం వర్రీ అని పరిశోధనల ద్వారా నిర్ధారణ చేశారు భగవంతుడిచ్చిన ఆయుర్దాయాన్ని పూర్తిగా అనుభవించదలచిన వారెవ్వరూ వర్రీ లేకుండా, నిశ్చింతగా బ్రతకాలనీ, మానసికంగా యెల్లవేళలా ప్రశాంతంగా వుండాలనీ, దైవ విశ్వాసంతో బ్రతకాలనీ ఆధునిక మానసిక శాస్త్రజ్ఞులు కూడా అంగీకరించారు వర్రీకి కారణం ఏదయినా సరే దానియొక్క విష పరిణామం గుండెమీద, మెదడుమీద శరీరంలోని జీవ కణాలమీద, సూక్ష్మ రక్త నాళాలమీద, ఇంద్రియాల పైన తప్పక ప్రసరిస్తుంది. Rhe umatoid arthritis (కీళ్ళవాతం) కూ, వర్రీకీ చాలా దగ్గర అనుబంధం వున్నట్లు న్యూరాలజిష్టులు నిరూపించారు.

## వర్రీని దూరం కావించే సాధనాలు

వర్రీతో పనిచేయటం ద్వారా నిత్యజీవితంతో పనిచేయటంలోని ఆనందాన్ని కోల్పోతాం. నవ్వుతూ సంతోషంగా ఎంతపనినయినా సరే నిర్వహించటం నేర్చుకోవాలి ఒక విధంగా ఆధ్యాత్మిక పరమైన, మత సంబంధమైన సాధనలద్వారా యిది సాధ్యమే! కానీ అందరికీ అది సాధ్యం కావటం లేదు. "మీరు భగవంతుణ్ణి విశ్వసిస్తారు కదా! మరి ఎందుకు వర్రీ అవుతారు?" అని అడగవలసి వస్తోంది. భగవంతునికి శరణాగతి చెందటం ద్వారా అన్ని వర్రీలూ తొలగిపోవాలి లేకపోతే అది శరణాగతి కాదు భగవద్విశ్వాసం ఆత్మవిశ్వాసం రెండూ ఊపిరిలో గల ఉచ్ఛ్వాస,

విశ్వాసాలు కావాలి అప్పుడు వర్రీలు, చింతలు, ఏడుపులూ, పెడబొబ్బలూ జీవితంనుంచి నిష్క్రమిస్తాయి, అని భగవద్భక్తుల చరిత్రలు నిరూపించాయికదా! లోకులు ఎన్నో చింతలతో, వంతలతో దుఃఖిస్తూ వుంటారు కానీ "సకల చింతల బాపు సర్వేశ్వరుని చింత గైకొనరు" అంటారు భగవాన్ బాబా.

ఈ దిగువ సూచించిన అంశాలు మన నిత్యజీవితం లోని ఆలోచనా విధానంలో ప్రతిబింబించుతూ మనల్ని ప్రభావపరచాలి ఇవి మనకుగల 'వర్రీ' ని తొలగిస్తాయి.

1) ఇతరుల వర్రీలను తొలగించటంలో మనం చాలా శ్రద్ధ వహిస్తూ, మన శక్త్యానుసారం యితరులకు గల చింతలను తొలగించటంలో సేవాభావంతో ప్రేమ భావంతో పనిచేయాలి "నాకు చింతలు లేవు, సమస్యలూ లేవు మీ చింతను, మీ సమస్యనూ పరిష్కరించటంలో నేను సహకరించినట్లే, నా చింతలను, నా వర్రీలను భగవాన్ శ్రీ సత్యసాయి బాబా పరిష్కరిస్తూ వుంటారు. కాబట్టి నా వర్రీల బ్యాలెన్సు నిల్ " అంటూ వుంటాడు, ఈ వ్యాస రచయిత

2) 'నేనెప్పుడూ చాలా బిజీగా వుంటాను అనే భావంతో, దైవీశక్తితో, పట్టుదలతో ప్రతి క్షణం ఒక నిర్మాణాత్మకమైన కృషిలో మునిగిపోతాను. ఆనందంగా మునిగిపోతాను నాకు ఇష్టంలేని వాటిని గూర్చి, భయాలనూ, ఆందోళనలనూ గూర్చి నా మనస్సు ఏమాత్రం ఒక్కక్షణం కూడా పట్టించుకోదు' ఇది ఒక విధమైన సాధన. పర దూషణలూ, వృధా నిందలూ, అర్ధరహితమైన విమర్శలూ మన మనస్సులో చోటుచేసుకోరాదు 'అయ్యో! నాకు వర్రీ చెందటానికి, చింతిస్తూ కూర్చోటానికి టైం లేదు' అనగలిగిన తీరుగా బ్రతకాలి, అలా బ్రతకటం అలవాటు చేసుకోగలగాలి.

3) ఒక పెద్ద చెట్టును కొట్టివేయాలంటే ఒక్కసారిగా దాని మూలాన్ని ఛేదించాలనే భావన సరియైనది కాదు. ముందుగా సన్న కొమ్మలను నరకాలి తరువాత లావు పాటి కొమ్మలను నరకాలి. తర్వాత బోదెను పైనుంచి ముక్కలుగా నరకాలి. చివరకు మూలం దగ్గర ఛేదించాలి. ఇది సుకరంగా పెద్ద చెట్టును నరికే పద్ధతి. ప్రమాదాలు జరగకుండా నరికే పద్ధతి. అదే రీతిగా జీవితంలో చిన్న చిన్న వర్రీలను రహితం చేసుకోవటం నేర్చుకోవాలి. ప్రతి చిన్న విషయానికీ వర్రీ కావటం జరగకూడదు. వర్రీ కలిగించే ప్రధానమైన అంశాలపైన దృష్టి సారించి, వాటికి సరియైన పరిష్కారాలను నిర్ణయించి, ఆ రీతిగా వాటిని సాధించగలగాలి. అంతేకానీ, వర్రీ చెందుతూ బ్రతుకును భారం చేసుకోకూడదు. జీవితం ఒక ఈత వంటిది. ముందుగా చెరువుల్లో, చిన్న చిన్న కాల్వలలో ఈత కొట్టి, తర్వాత నదిలో ఆ ఒడ్డు నుంచి ఈ ఒడ్డుకు ఈది, ఆ తరువాత సముద్రంలో ఒక గజ ఈతగాడు ఈదినట్లుగా ఈ జీవిత సముద్రంలో ఈదుతూ పోవాలి అందుకు సాధనే శరణ్యం'

4) నార్మన్ విన్సెంట్ పీల్ 'The Power of Positive Thinking' అనే పుస్తకంలో ఒక ప్రాక్టికల్ సూచన చేస్తారు ప్రతిరోజూ ఒక గదిలోనో, ప్రకృతిలోనో ఏకాంతంగా కూర్చోవాలి మనల్ని భయభ్రాంతులు కావించే పరిస్థితులను ఒక్కొక్క దానినే మనస్సులోనుంచి బయటకు నెట్టి వేస్తూ కూర్చోవాలి. 'రోగ భయం నాకెందుకూ? నాకు తప్పక ఆరోగ్యం కలుగుతుంది. పరాజయమా (Failure)? ఎందుకు భయపడాలి? తప్పక విజయం సాధిస్తాను' ఈ ధోరణిలో భయాన్నీ వర్రీని కలిగించే మానసిక స్థితిని క్రమంగా కాస్సేపయినా వదిలించుకోవటం నేర్చుకోవాలి. Conceive of yourself as actually emptying the mind of all anxieties and fears. Picture all worry thoughts as flowing out as you would let water flow from a basin by removing the stopper Repeat the following affirmation during this visuacisation : 'with God's help I as now emptying my mind of all anxiety, all fear, all sense of in security'' ఈ రీతిగా వారు సూచిసారు

5 నిముషాల తర్వాత 'భగవంతుని కృపచేత నా ఆందోళనలనూ, భయాలనూ, వదలివేస్తున్నాను' అంటూ స్వయం ప్రేరణ కావించుకోవాలి.

ఆ తర్వాత 5 నిముషాలు 'నా ఆందోళనలూ, వర్రీలు, భయాలు పోయినై. దైవం నన్ను అనుగ్రహిస్తున్నారు' అనుకుంటూ కూర్చోవాలి.

ఈ సాధనను ప్రతిరోజూ నిద్రపోయే ముందు చేయమంటారు. అవసరం అయితే ప్రతిరోజు ఉదయం మధ్యాహ్నం, రాత్రి ఈ స్వయం ప్రేరణ సాధన ద్వారా మనం మన మనస్సును శక్తివంతం కావించి, మనస్సు నుంచి వర్రీలను, భయాలను తరిమివేస్తాం

5) 'ఏది జరిగినా నా మేలుకే' అనే భావాన్ని పెంచుకోవాలి నిజంగా దైవం మీద విశ్వాసం కల వారెవ్వరూ నిత్య జీవితంలో తటస్థించే పరిస్థితులను గూర్చి వర్రీ కారు అలా అని వాటిని ఉపేక్ష భావంతో చూడరు 'Accept the present moment as it is' అనే వేదాంత భావం చాలా గొప్పది. ఎప్పుడూ గతాన్ని మనస్సులో చిత్రించుకుంటూ బ్రతికేవారూ, ఎప్పుడూ రాబోయే రోజులనుగూర్చి చింతిస్తూ బ్రతికేవారూ వర్తమానంలో తమ కర్తవ్యాన్ని, బాధ్యతనూ సరిగ్గా నిర్వహించలేరు. Live in the present అంటారు భగవాన్ బాబా. వర్రీ లేకుండా బ్రతకటంలో ఇదొక ప్రధానమైన మానసిక స్థితి

6) ఎప్పుడూ మనకంటే అదృష్టవంతులను ఉన్నతులనూ చూచి వారికి వున్నదే, మనకు లేదే అనే ధోరణి తప్పక వర్రీకలిగిస్తుంది. అసూయను రేకెత్తించుతుంది మనకంటే ఎందరో అభాగ్యులు వున్నారని వారిని తలచుకొని వారి సేవకై కొంతయినా బ్రతికితే, అటువంటి వ్యక్తికి తన స్వంత వర్రీలు వుండవు.

## ఒక అనుభవం

అవి 1970 దశకంలోని రోజులు తోటి ఉద్యోగి ఒకడు ఎందుకో అదోలా అయిపోతున్నాడు చాలా బుద్ధిమంతుడు. దైవభక్తి - సదాచార పరాయణుడు. కానీ అతనికి దాదాపు బ్యాలెన్సు తప్పింది మానసికంగా. సూటిగా అడిగాను 'నీ లోపల ఏదో అగ్నిపర్వతం రగుల్కొంటోంది. అది బ్రద్దలు కాకముందే నిన్ను నీవు కాపాడుకో' అని హెచ్చరించాను ప్రేమగా.

'అవును సార్! మా తల్లిగారి ఆస్థిని తమిళనాడులో మా మేనమామ అక్రమంగా తానే అమ్ముకుంటున్నాడు. పంట భూములను రైతులకు స్వాధీనం చేస్తున్నాడు. దున్నేవాడిదే భూమి అనే సిద్ధాంతం క్రింద రైతులను రెచ్చగొట్టి మా అమ్మగారి పంటపొలాలను అన్యాక్రాంతం చేస్తున్నాడు తండ్రిగారు పోయారు కనుక, మా అమ్మ తన సోదరుని మీదనే ఈ వ్యవహారాలలో ఆధారపడి బ్రతుకుతోంది మేము యిక్కడ (వారు తమిళులు). మా మేనమామ సేలం జిల్లాలో. ఈ ఆస్తి మాకు దక్కకుండాపోతే మేమంతా సర్వనాశనమైపోతాము' అంటూ ఏడ్చాడు. ఈ వర్రీని తట్టుకోలేక అంతటి బుద్ధిమంతుడు బార్‌లోకిపోయి ఒక బుడ్డికొట్టే ఆలోచనకు కూడా దిగజారిపోతున్న పరిస్థితిలో అతని మనస్సు పడిపోయింది. రాత్రి నిద్ర పట్టక నిద్రమాత్రలు వుచ్చుకొనే పరిస్థితిలో వున్నాడు అతనికి B. P. కూడా పెరిగింది. ఏదైనా రైలుక్రింద పడి ఆత్మహత్య చేసుకుంటే బాగుండును, అనే మానసిక స్థితి కూడా అంకురించింది అతనిలో. అతనికి చేసిన సూచనలు యివి -

1) మీ మామ నీకు ద్రోహం చేస్తున్నాడనే చింతను ఈ క్షణంనుంచీ వదలిపెట్టు'

2) హాయిగా వుండు. అదంతా నా మనస్సు చేసిన మాయా సంక్షోభం మీ మేనమామలో వున్న మానవత్వాన్ని మేల్కొల్పి న్యాయం జరిగే రీతిగా దైవానుగ్రహంతో నా ఆస్తిని నేను దక్కించుకొంటాను. రైతులు కూడా వారికే ఆక్రమించరుకదా ! ఆ భూమి ఖరీదును కోర్టు యిచ్చే తీర్పు మేరకు వాయిదా పద్ధతిలో నైనా చేతిలో వేసుకోవచ్చుకదా ! కాబట్టి సర్వనాశనమై

పోతాము అనే వర్రీ నా మనస్సు చేసిన మాయ. అన్నింటికీ మించి ఒక Plus point వుంది. మా మేనమామ కొడుక్కి మేమంటే చాలా ప్రేమ, అభిమానం. కాబట్టి మేనమామ కొడుకు ద్వారా పూర్తి న్యాయాన్ని దక్కించుకోగలను - జరిగిందంతా నా అజ్ఞానంచేత నా మనస్సు వర్రీ అనే ఉచ్చు వన్ని నన్ను భీతావహుణ్ణి చేసింది. నేను ప్రతి రోజూ ఏ దైవానికి నమస్కరిస్తానో ఆ దైవం నా వెంట వున్నాడు. ఈ రీతిగా మానసికంగా అనుకుంటూ సేలం వెళ్ళి వాస్తవాన్ని కళ్ళతో చూడమని చెప్పాను.

ఒక విధంగా అతని మనస్సులో అలముకొన్న చీకటిని, భయాందోళనలనూ ఈ రీతిగా వివరించి, తొలగించాను వెంటనే మర్నాడే అతని B P. తగ్గింది. ముఖంలో ప్రశాంతి, వర్చస్సు పెరిగింది .

అక్షరాల పై సూచనలు అనుసరించాడు. పదిరోజుల్లో సేలం వెళ్లి క్షేమంగా తిరిగివచ్చాడు

'అయ్యా ! మీరు చేసిన ప్రతి సూచననూ అనుసరించాను అక్షరాలా మీరు చెప్పినవన్నీ జరిగాయి మా నాయన స్వార్థపరుడు కావచ్చు నీ ఆస్థిని స్వంతం చేసుకొనే పనిచేయడు చేసినా అతని పుత్రునిగా నేను నిలబడి నీకు న్యాయం జరిగేట్లు చేస్తాను, అనే బావమరది హామీతో కథ అడ్డం తిరిగింది 'అయ్యా ! మార్కెట్టులో ధర ఎంత పలుకుతుందో అంత ధరను మీకు చెల్లించి మీ పొలాన్ని తీసుకుంటాం , అది కూడా మీ పొలాన్ని అమ్మదలచితేనే ! లేకపోతే మీ పంట పైకం మీకు యదాతథంగా మీ మేనమామ ద్వారా మీకు చెల్లిస్తాం' అని రైతులు ముఖాముఖీ సంభాషణలో వివరించారు. అంతేకాదు ! అంతకాలం పంటలతాలూకు పైకం తన బ్యాంక్ అకౌంట్ లో భద్రపరచిన మొత్తాన్ని మన మిత్రుని పేర డ్రాఫ్టు రూపంలో వేసి, చేతికి అందించాడు మేనమామ

ఈ రీతిగా కథ సుఖాంతం అయింది.

లేకపోతే అతడు దైవభక్తుడు అయి ఉండి మనిషి మానసికంగా ఆరీతిగా దిగజారిపోవటానికి కూడా ఎందుకు సిద్ధపడ్డాడు ? పొరపాటున ఈ వర్రీలో రైలు క్రింద పడితే దైవం క్షమిస్తాడా : చదువుకొని, సంస్కారం కలిగినప్పటికీ ఈ 'వర్రీ' కి అంతటి రాక్షసబలం ఎలా కలిగింది ? ఇలాంటి ప్రశ్నలకు ఒకటే సమాధానం.

మనం దైవభక్తులం అనుకుంటున్నాం చదువూ, సంస్కారం కలిగిన వారమని మనకు మనమే గర్విస్తున్నాం కానీ ఇవన్నీ ఒక్క క్షణంలో మటుమాయం అయిపోగలవు కాలం, పరిస్థితులూ అలాటి దుష్ట భావాన్ని కలిగిస్తాయని తెలుసుకొని, ముందుగానే మేలుకొని, మనస్సుల మర్మాన్ని ఎవరికి వారే గుర్తించి, టెన్షన్లకూ, వర్రీలకూ నిత్య జీవితంలో బలికాకుండా బ్రతకగలగాలి

( ఆధ్యాత్మిక సాధనల ద్వారా మనస్సు ఎలా స్థిరత్వాన్ని, స్థిత ప్రజ్ఞతను పొందేదీ తర్వాత రెండు వ్యాసాల్లో ఉదాహరణ పూర్వకంగా తెలుసుకుందాం.

సంపాదకుడు)

## సత్యసుగుణధామ ! సాయిరామ!

క్షేత్ర రత్నమైన షిరిడి చేరుటతోనె
బద్దలగును పాప భాండమనెడు
సత్యసూక్తి దెల్పు సర్వేశ్వరుండవు
సత్యసుగుణధామ సాయిరామ !

సంకటంబు లన్ని సంహరించు సమాధి
నాది సందియంబు లేదటంచు
దివ్యబోధ సేయు దేవదేవుండవు
సత్యసుగుణధామ సాయిరామ !

నేలపైన గొట్టి నిప్పును రాబట్టి
జలముతోడ దివ్వె వెలుగజేసి
మహిమ చూపినట్టి మహిమాన్వితుండవు
సత్యసుగుణధామ సాయిరామ !

- ఏకా రామచంద్రరావు

# గురుగోవిందసింగు

-కవ్వుల ఆంజనేయశర్మ

స్వదేశ రాజులలో ఐక్యత లేకపోవడం, విదేశీయులకు మంచి అవకాశం వచ్చింది. సింధూనదిని దాటి మహమ్మదీయులు వచ్చిపడ్డారు. అంతఃకలహాలవల్ల భారతీయ రాజులు చాలామంది చనిపోయారు. మిగిలిన భారతీయులు బలవంతంగా ఇస్లాం మతంలోకి మార్చబడ్డారు. అన్నివిధాలా హిందూమతం తుడిచిపెట్టుకు పోయే పరిస్థితి ఏర్పడింది.

వీటిని చూచిన 'గురునానక్' ఐక్యతకోసం శిష్యుల్ని తయారుచేశాడు వారే శిక్కులు. మతపరమైన దుర్మార్గాలు పెచ్చుపెరిగిపోయాయి. శిక్కులను అణచివేయుట ప్రారంభమైంది. శిక్కుల గురువు 'గురుగోవిందు' పరిస్థితులను గమనించాడు. తమ కాళ్ళమీద తాము నిల్చుని ఆత్మరక్షణ చేసుకోవడం ప్రథమ కర్తవ్యమయింది. దానికి కావలసిన శస్త్రవిద్యనంతా శిష్యులకు చెప్పి, వారిని మహావీరులుగా చెయ్యాలనుకొన్నాడు. శిక్కుధర్మాలలోని నియమాలలో మార్పు తెచ్చాడు. ఆచరణ విధులు కఠినం చేశాడు. ప్రతి శిక్కు సభ్యునిలోను వీరరక్తం నింపాలనుకున్నాడు.

తన ఉద్యమానికి ముందుగా 'కొంతమందిని ఎంపిక చేయవలసివచ్చింది. అందుచేత ఒకనాటి రాత్రి ఊరి బయట మైదానంలో సమావేశం ఏర్పాటుచేశాడు. మైదానం మధ్యలో ఒక గుడారం వేయబడింది. అందులో దేవీ విగ్రహం ఉంచబడింది. సభ్యులందరూ గుడారం ముందు చేరారు. అంతా నిశ్శబ్దంగా ఉంది.

'మనమంతా నేడు చాలా దరిద్రస్థితిలో ఉన్నాం' - గురుగోవిందుని గొంతు వినిపించింది.

'అవును, నిజమే, ఏం చెయ్యాలి' అనే ప్రశ్న అందరి మనస్సులలోనూ పుట్టింది.

'మన దరిద్రస్థితికి మనమే కారకులం' - గురుగోవిందుడు తిరిగి మొదలుపెట్టాడు.

'నిజమేనా ?' సభ్యులు అనుమానపడ్డారు.

'మనలో ఐక్యతలేదు. స్వార్థపరులమై సమాజ శ్రేయస్సుని, దేశ శ్రేయస్సుని మరచిపోయాం. ఎవరికి వారే ఒంటరిగా ఉంటూ మిగిలిపోయాం' అన్నాడు గురుగోవిందు.

'అవును, నిజమే' సభ్యులందరు ఒప్పుకున్నారు.

'ఒంటరివాడిననే భావన మనం మర్చిపోవాలి' అన్నాడు గురుగోవిందు.

'దానికి మార్గమేమిటి ?' సభ్యులన్నారు.

'మనమంతా ఒకటిగా ఉండాలి. మనమందరం సోదరులం. ఎవరికి కష్టం వచ్చినా, మనకు వచ్చినట్లే నని భావించాలి. నేటి పరిస్థితులలో మనల్ని మనమే రక్షించుకోవాలి. దానికి మనమందరం సిద్ధంగాఉండాలి. లేకపోతే నామరూపాలు లేకుండా నాశనమైపోతాం' గురుగోవిందు అన్నాడు.

'అవును, నిజమే ! సిద్ధపడాలి. లేకపోతే నాశనం తప్పదు' అనుకున్నారు సభ్యులు.

'అందుకు అవసరమైతే ఎంతటి త్యాగానికైనా మనం సిద్ధపడాలి. ప్రాణం పోయినా లెక్కచేయకూడదు. సమాజ శ్రేయస్సే మన శ్రేయస్సు' అన్నాడు గురుగోవిందు.

'అవును ! ఎంతటి త్యాగానికైనా మేం సిద్ధం' ఒక్కుమ్మడిగా గొంతెత్తి అన్నారు సభ్యులు.

'అయితే చెబుతా వినండి. మన కార్యక్రమం ప్రారంభించేముందు దేవీ పూజ చేయాలి కావలసిన బలిదానాలు చేయాలి' అన్నాడు గోవిందుడు.

'అలాగే కానివ్వండి' అన్నారు సభ్యులు.

గుడారంలో గంటలు మ్రోగాయి పూజాక్రమం ప్రారంభమైంది. గురుగోవిందు గుడారంనుంచి బయటకు వచ్చాడు 'దేవికి బలి యివ్వడానికి ఒకరు కావాలి వేగంగా రండి' అన్నాడు

ఒకరి ముఖాలొకరు చూసుకొన్నారు 'నే వస్తానని' ఒక సభ్యుడు లేచి గుడారంలోకి వెళ్ళాడు 'కంగు' మని కత్తి చప్పుడయింది. 'టప్' మని శిరస్సు ఎగిరిపడినట్లు శబ్దం 'దబ్బు' మని శరీరం నేలమీదబడినట్లు చప్పుడు. రక్తం చిమ్మి గుడారంమీద చెదిరింది.

'దేవికి మరొకరు కావాలి' అని గురుగోవిందు బయటకు వచ్చాడు. తిరిగి మరొకరు గుడారంలోనికి నడిచారు. మునుపటిలాగే గంటలు మ్రోగాయి. చప్పుడయింది. రక్తం చిమ్మి గుడారంమీద పడింది. 'దేవికి ఇంకొకరు కావాలి' అన్నాడు గురుగోవిందు. ఇంకా.... అన్నాడు తిరిగి వచ్చి గురుగోవిందుడు. సభ్యులు ఒకరి తరువాత మరొకరు లేచారు అప్పటికి అయిదుగురు అయ్యారు సభ్యులలో ఉత్సాహం పొంగింది ప్రతివాడు తన వంతుకు సిద్ధమయ్యాడు. సభ్యులలో కావలసిన ఉత్సాహం, ధైర్యం, త్యాగం, సాహసం కనిపించాయి గురుగోవిందునికి గుడారం తెరలు వత్తిగింపబడ్డాయి బలి అయ్యారనుకొన్న సభ్యులైదుగురూ బ్రతికే ఉన్నారు వారి స్థానంలో ఐదు మేకలు బలి అయ్యాయి ఆ వీరపుత్రుల రక్తం రక్షింపబడి వీరసైన్యం తయారయింది. ◯



## సత్యసాయి వాక్కు - సత్య వాక్కు

పాపమెల్ల జేసి పరితాప మొందిన
పూర్ణ మనసుతోడ పుణ్యమబ్బు
కైవమిచ్చి ముక్తి దరిజేర్చు నాతని
సత్యసాయి వాక్కు సత్యవాక్కు
సకల విద్యలున్న సర్వ సంపదలున్న
స్వామి దయను పొంద సాధ్యపడదు
ప్రేమమూర్తి హరియె ప్రేమకే వశుడౌను
సత్యసాయి వాక్కు సత్యవాక్కు
త్యాగమున్న నేమి భోగముండిననేమి
లక్ష్యశుద్ధిలేక లాభమేమి
మనసులోని దృఢము మహినెల్ల గెలిపించు
సత్యసాయి వాక్కు సత్యవాక్కు

– ఎం. సి. కేశవకుమార్




యో నోద్ధతం కురుతే జాతు వేషం
న పౌరుషేణాపి వికత్థతేఽన్యాన్
న మూర్ఛితః కటుకాన్యాహ కించిత్
ప్రియం సదా తం కురుతే జనోహి

ఎవడు ఎన్నడును ఆడంబరముతో కూడిన వేషమును ధరింపడో, ఇతరుల ఎదుట పౌరుషము చూపుచు తనను తాను పొగడుకొనడో, క్రోధావిష్టుడై పరుషముగా మాట్లాడడో, అట్టివారిని ప్రజలు ఎల్లప్పుడు ప్రేమ భావముతో చూతురు.

# గీత - అమృతవర్షిణి

-సాయి గంగామహాదేవి

శ్లో॥ సాధిభూతాధి దైవం మాం సాధియజ్ఞంచ యే విదుః ।
ప్రయాణ కాలేఽపి చ మాంతే విదుర్యుక్త చేతసః ॥

"ఎవరు నన్ను అధిభూత, అధిదైవముతో గూడిన వానిగను, అధియజ్ఞముతో కూడిన వానిగను, ఎరుగుచున్నారో వారు మరణకాలమునందు సైతము నిగ్రహింపబడిన మనస్సు గలవారలై నన్నెరుంగుచున్నారు" అని భగవానుని ప్రబోధ.

మానవుడెన్ని రకముల విజ్ఞానముల సంపాదించి నప్పటికినీ అవి మరణ సమయమున గుర్తుకు రావు. కారణము మరణకాలము నందలి యాతన వర్ణనాతీతము. చేయి నరుక వేయబడిన సమయంలో సంగీత విద్వాంసుని విద్వత్తు ఆ బాధ వలన ఆ సమయానికి గుర్తు రానట్లుగా మానవుని ప్రాపంచిక ప్రజ్ఞలేవీ మరణ సమయంలో యథాతథంగా గుర్తుకు రావు. కానీ భగవంతుని అధిభూత, అధిదైవ, అధియజ్ఞములతో కూడినవానిగా ఎవరైతే హృదయపూర్వకంగా గ్రహిస్తున్నారో అట్టివారు మరణకాలంలో కూడా దైవాన్ని ఎరుగుచున్నారని భగవానుని ప్రబోధ. అనగా అర్థమేమిటి ?

భగవానుని పైవిధంగా గుర్తించినవారికి మరణ యాతన ఉండదని భావము. మరణయాతన దేహధ్యాస గలవారికి, దైవధ్యాసకలవారికికాదు కారణము మరణము దేహసంబంధమైనది. కనుక, దేహసంబంధులకు మరణయాతన, దైవసంబంధులకు మరణయాతన లేదు. మరణయాతన లేదు కనుకనే వారు ఆ సమయంలో కూడాచక్కగా దైవాన్ని గుర్తింపగలుగుతున్నారు. కనుక మానవులు ఇంద్రియాదులు శక్తివంతములై యుంటున్నప్పుడే హృదయపూర్వకంగా దైవతత్వాన్ని గ్రహించాలి అధిభూత, అధిదైవ, అధియజ్ఞము లంటే ఏమిటో గుర్తించాలి

1) "అధి భూతము" అంటే ఏమిటి ? భగవానుడే చెప్పాడు 'అధి భూతం క్షరో భావః'. భావః = పుట్టి : క్షరః = నశించేవి : అధిభూతములు. అనగా జనన, మరణములున్నా ప్రతిదీ అధిభూతమే. అనగా సమస్త విశ్వమూ అధిభూతమే. 2) "అధిదైవం" అనగా ఏమిటి ? 'పురుశ్చాధి దైవతం' పురమనగా దేహము. ఇట్టి పురమందున్నవాడే పురుషుడు అనగా జీవుడు. అనగా జీవుడే అధిదైవతము 3) 'అధియజ్ఞం' అనగా ఏమిటి ? "అహమేవ అధియజ్ఞః" – 'అహం' అనగా 'నేను' అని అర్థము ఇచట 'నేను' అనగా ఆత్మ. ఆత్మయే అధియజ్ఞమని అర్థము.

అధిభూతము = ప్రకృతి, అధిదైవం = జీవుడు; అధియజ్ఞం = ఈశ్వరుడు జీవేశ్వర ప్రకృతులే ఆ మూడు జీవేశ్వర ప్రకృతుల సమిష్టితత్వమే దైవతత్వము ఈ విషయమును గుర్తించినవారు దేహావసాన కాలంలో కూడా 'మాం - విదుః' చలించనివారై ఆత్మవిదులుగా ఉంటున్నారని భావము

ప్రకృతి = 8 : జీవుడు = 0 ; ఈశ్వరుడు = 1. 'భిన్నా ప్రకృతి రష్టధా' అని ప్రమాణము కనుక ప్రకృతి = 8 ; జీవుడు మిథ్య. యదార్థంగా జీవుడు లేడు. అది భ్రాంతి కనుక జీవుడు 0 ; ఈశ్వరుడు=1 'ఏకం సత్' అను శృతి వాక్యమే ప్రమాణము. 'అంకానాం వామతో గతిః' అను సూత్రము ప్రకారం కుడి నుండి ఎడమకు చదవగా 108 ఔతుంది. ఇదే 108 యందలి విశిష్టత్వము జీవుడు ప్రకృతికి, ఈశ్వరునికి మధ్యలో ఉన్నాడు, ప్రకృతిని సేవించి, పరమాత్మను సమీపించి వారి యందు లయం కావాలి. ఇదే ధ్యేయం.

# యువత సన్మార్గాన నడవాలయా !

———— ఆర్. యస్. కె. మూర్తి

ఈ మధ్య బొంబాయి వెళ్ళాను అక్కడుండగా ఒక రోజున టూరిస్టు బస్సులో నగర సందర్శనానికని వెళ్ళాం. సాయంత్రం ౬ గంటలకు జుహూబీచ్‌కి చేరుకున్నాం. అప్పటికింకా బీచ్ జనసందోహాలను నింపుకోలేదు. కొద్దిగా మాత్రమే జనాలక్కడక్కడా అగుపడుతున్నారు ఒంటెలనెక్కేవాళ్ళు, గుర్రాలెక్కేవాళ్ళు, సముద్రంలో కాళ్ళు తడుపుకొనివచ్చేవాళ్ళు .... అట్లా సరదాలు తీర్చుకుంటున్నారు జనాలు వాళ్ళ మధ్యనే తిరుగుతూ కన్పించారు మూడు నాలుగు జంటల వాళ్ళు. ఆడ మగ - ఒకరి బుజాలమీదొకరు చేతులు వేసుకొని, Siamese సియామీస్ కవలల్లా కరుచుకు పోయి బీచ్ విహారం చేస్తున్న జంటలు. అంతవరకు వెండితెరమీద తప్ప, వాస్తవ జీవితంలో ఏనాడూ చూడని శృంగార దృశ్యం విస్తుపోయి చూచాం వారిలో ఒక జంట పదిహేను పదహారు సంవత్సరాల లోపు వారే. అమ్మాయికి ఒక చేతిలో పుస్తకాలు, అబ్బాయి రెండు చేతులు అమ్మాయిని చుట్టుకునేఉన్నాయి ఆ అమ్మాయి తల్లిదండ్రులు ఆమోదించే విహారమేనాయిది ? మరో గంట అక్కడ ఉంటే - యిట్లాంటి బహిరంగ శృంగార దృశ్యాలు మరెన్ని చూచేవారమో?

బీచ్ నుంచి బయలుదేరింది - మా టూరిస్టు బస్సు (Mahim) మాహిం మీదుగా పరుగులు పెడుతున్నది శివసేన భవనం దాటుకొని వచ్చాం మరికొండా చౌక్ ప్రాంతానికొచ్చాం కొల్కర్ రోడ్డుమీద ఒకచోట ట్రాఫిక్ సిగ్నల్ కారు ఆగిపోయింది. ఆగిన కారు ముందొక ఆగిన టాక్సీ ఆ టాక్సీ వెనుక సీటులో ఉన్నారో జంట. బహిరంగంగా ముద్దులు పెట్టుకుంటున్నారు ఆగిన వాహనాలవారందరూ విస్తుపోయిచూస్తూనే ఉన్నారు అయితేనేం, వాళ్ళలోకం వాళ్ళదిగా ఉంది బహిరంగంగా ప్రణయానికి కుక్కలకూ, పిల్లులకూఉన్న స్వేచ్ఛ మనకు లేదా అన్నట్లుగా ఉంది - వారి నిస్సంకోచ ధోరణి. ఏమిటీ విపరీతం !

వీరబ్రహ్మేంద్రులవారు తమ కాలజ్ఞాన తత్త్వంలో చెప్పారు. స్త్రీలు జుట్టు కత్తిరించుకొని సైకిళ్ళెక్కి తిరుగుతారనీ .... అశ్లీలపు సినిమాలు వస్తాయనీ .... అవినీతి పెరుగుతుందనీ, అవినీతి ప్రభుత్వాలు కట్టించే బ్రిడ్జీలు 'ఆత్మహత్యకు నీట దూకెనయా' అంటూ నేడు నిజమవుతున్న ఘోరాలను వారేనాడో వెల్లడించారు.

అయితే యువత సన్మార్గాన నడవటానికి ప్రోత్సాహకరమైన పరిస్థితులు నేడు ఉన్నాయా ! రోజుకీ రోజుకీ వారిని అపమార్గాన పట్టించే అంశాల ప్రభావమే పెరిగిపోతున్నది గదా ! ఇదివరలో ఎక్కడోఉన్న థియేటరుకెళ్ళి, టిక్కెట్టు కొనుక్కొని చూచే సినిమాలలో మటుకే గల అసభ్యపు దృశ్యాలు పొందగల ఉద్రేకాలు నేడు యింట్లో కూచొని.... ఏదో ఒక టి వి ఛానెల్‌లో పగలూ రాత్రి పొందే అవకాశం టి వి. లు కల్పిస్తున్నాయి అట్లా ATN, MTV వంటి ఛానల్సులో 24 గంటలూ ఉద్రేకాల ప్రజ్వలనాలే గదా ! బుల్లి తెర మీదనో, వెండి తెర మీదనో చూచిన దృశ్యాలను జుహూ బీచ్‌లోనో.... నడిరోడ్డుమీదో అనుకరిస్తున్నది యువతరం కాదంటారా ?

తలితండ్రులు వివేకవంతులైతే నివారించగల ప్రమాదమిది పిల్లలను ఒంటరిగా సినిమాలకు వెళ్ళనీయకపోవటం, టి వి లు కొనకపోవటం, కొన్నా వాటిలో విదేశాల ఛానల్సు ఏర్పాట్లు చేసుకోకపోవటం. ఇటువంటి వాటిపై వ్యామోహాన్ని ముందు తలితండ్రులు నివారించుకోగలిగితే అది ఏ అంటువ్యాధి లాగానో పిల్లలకు అంటకుండా చూచుకోవచ్చు. పరిశుభ్రమైన సౌశీల్య ప్రపూరితమైన గృహవాతావరణంలో పెరిగిన పిల్లలు మంచి నడవడిక కలవారవుతారు. స్వర్గాన్ని యిలపైకి తెస్తారు. పిల్లలకు విషం పెట్టకపోవటమొక్కటే కాదు, పెద్దలు తీసుకొనవలసిన జాగ్రత్త ! 'యువత సన్మార్గాన నడవాలయా' అన్నది తలితండ్రుల తారక నామస్మరణ కావాలి.

○

# శ్రీ సత్యసాయి బాబావారి సర్వవ్యాపకత్వము సర్వశక్తివంతము

పెగ్గిమేసన్

( " కాన్ సాయి లైట్ " - నుండి అనువాదము : యస్. బి. యస్. రామారావు )

" శ్రీమతి పెగ్గిమేసన్ " ఇంగ్లాండులో నివసిస్తున్నది ఈమె గొప్ప రచయిత్రి. ఆధ్యాత్మికంగా చాలా కృషి చేసిన వ్యక్తి ఈమె భర్త పేరు 'రాన్‌లింగ్' ఆస్ట్రేలియాలో జరిగిన ఒక గొప్ప ఆధ్యాత్మిక సదస్సుకు ఈమె హాజరైనపుడు ( 1978 వ సం॥లో ) ఈమె స్నేహితుడు, 'న్యూజిలాండ్' నుంచి వెలువడే ఆధ్యాత్మిక మాస పత్రికను 'ది హెరాల్డ్స్ ఆఫ్ న్యూయేజ్' (The Heralds of New Age) చదవమని 'మేసన్' కిచ్చాడు. ఆ పత్రిక భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారిని గురించి వివరిస్తూ, ప్రపంచములో సుఖశాంతులతో కూడిన నూతన యుగమును 'సత్యసాయి శకము' ను తీసికొనివచ్చుటకు అద్భుత శక్తులతో అవతరించిన భగవంతుడే సాయిబాబా యని పేర్కొన్నది ఈ వార్త చదవగానే ఆమెకు ఎలక్ట్రిక్ షాకు తగిలినట్లయినదట వెంటనే ఆమె ఈ పత్రికకు చందా కట్టి ప్రతినెలా ఆ పత్రికను తెప్పించుకొనుట మొదలెట్టెను ఒక నెల పత్రికలో ' శ్యామూల్ సాండ్‌విస్ ' సాయిబాబాగారిపై వ్రాసిన పుస్తకముపై 'బుక్ రివ్యూ' వచ్చినప్పుడు అచట స్వామిది చక్కని 'నవ్వుచున్న ఫొటో' ముద్రింపబడినదట పెగ్గిమేసన్ ఆ బొమ్మ కత్తిరించి, చిన్న అట్టపై అంటించి తన పడకగదిలో మంచమున కెదురుగా బీరువాపై పెటుకొన్నది ఒక రోజు రాత్రి మంచముపై పడుకొని ఆ ఫొటోను చూస్తుండగా, ఆ ఫొటో లేచి ఎగిరి గంతేసి, వెనక్కి ముందరకూ కదిలి తిరిగి యథాస్థానములో కూర్చున్నదిట ఆ ఫొటో నుంచి ఒక దివ్య కాంతి బయలు వెడలి ఆ గదియంతయూ ప్రసరించుట గమనించి ఆమె, ' ఓ బాబా ' అని కేకపెట్టి – ఈ ఆశ్చర్యకర సంఘటనకు తన కళ్ళను తానే నమ్మలేక పోయినది అంతవరకూ ఆమెకు సాయిబాబావారిని గురించి ఎక్కువ తెలియదు. అప్పడామె "శామ్యూల్ సాండ్‌విస్ " వ్రాసిన పుస్తకమును చదివిన సాయిబాబా వారిని గురించి ఎక్కువ వివరములు తెలియగలవని యోచించి ఆ పుస్తకమును సంపాదించు ప్రయత్నము చేసినది మరి రెండు రోజులకామెకా పుస్తకము లభించినది

ఇలా వుండగా, 1978 వ సం॥ లోనే ఆమె ఎడమ కాలుకు తొడవద్ద నెప్పి కలిగి, ఆ నెప్పి క్రమేపీ ఎక్కువై నడవలేని స్థితి ఏర్పడినదట. ఏ చికిత్స చేసినా ఆమె నెప్పి తగ్గలేదు. ఆమె ఇంటి వైద్యుడు ఆమెను స్పెషలిస్టు దగ్గరకు తీసికొని పోయెను ఆ వైద్యుడు "మేసన్" ను పరీక్షచేసి ఆమె కాలులోని రక్తనాళము పూడుకొనిపోయినదనీ, అది తొలగించుటకు వెన్నెముక నుండి తొడ వరకూ ఆపరేషను చేయవలసివచ్చుననియూ ఐననూ ఆపరేషను జయప్రదము అగునో లేదో చెప్పలేమనియు, ఒకవేళ ఆపరేషను జయప్రదము కాక పోయినచో కాలు కుళ్ళిపోవు ప్రమాదము కూడ కలదనియు, ఆలోచించుకొని ఆపరేషనుకు సిద్ధపడినచో మరునాడు రమ్మని చెప్పెను.

అట్టి డాక్టరు సలహాతో ఆమె మానసికముగ వ్యథ నొంది, ఆ రాత్రి సాయిబాబావారిని తన కాలు నొప్పి

తగ్గించమని ప్రార్థించి నిద్రపోయినది. ఆపరేషను గురించి ఆమె మరీ మరీ ఆలోచించుచూ ఒక నిర్ణయానకు రాలేకపోయెను

అంతలో వారింట్లో టెలిఫోను మ్రోగినది. ఎవరో ఆమెకు తెలియనివారు ఫోను చేసిరి ఆ ఫోను మెసేజీ ఇట్లున్నది. "నేనెవరో నీవు గుర్తించలేవు గణేశానంద అను భారతీయ స్త్రీ యొక్క స్నేహితుడను నేను. ఆమె నీ రచనలకు చాలా సంతోషించి, నిన్ను చూడాలని



కోరుచున్నది. ఆమె నీ ఇంటికి 15 మైళ్ళ దూరములోనే నివసించుచున్నది కావున ఆమెను నీ దగ్గరకు తీసికొని వచ్చుటకు అంగీకరించెదవా" అట్టి ఫోను మెసేజీ విని, ఆమె వచ్చి తనను కలిసికొనుటకు మేసన్ అంగీకరించినది. ఆ తరువాత పెగ్గీమేసన్ "శాండ్విచ్' వ్రాసిన పుస్తకము తీసి చదువుట మొదలెట్టవలయునని అనుకొనుచూ, తిరిగి ఆ పుస్తకమును టేబిలుపైనుంచెను. అంతలో శ్రీమతి గణేశానందజీ వచ్చి కూర్చుని, టేబిలుపై ఆమె దగ్గరలో కల ' శాండ్విచ్ ' వ్రాసిన పుస్తకముపై గల ' సాయిబాబా ' వారి ముఖచిత్రము చూసి, నవ్వెను. అంత మేసన్ ఆమెను మీకు సాయిబాబావారు తెలుసునా ? అని ప్రశ్నించెను ఆమె అవునని చెప్పినది. 'మీరు ఇండియావెళ్ళి బాబాను దర్శించితిరా?' అని మేసన్ గణేశానందను తిరిగి ప్రశ్నించినది. అవును మా కుటుంబమంతా సాయిభక్తులమే పూర్వావతారములో శ్రీ సత్యసాయిబాబాయే షిరిడిసాయిబాబా. నేను శివానందమహర్షి శిష్యురాలను ఆమె శ్రీమతి గణేశానంద ఆమెకు వివరించుచూ సంభాషణ కొనసాగించింది.

అంతలో శ్రీమతి గణేశానంద పెగ్గీమేసన్‌తో, 'నా ఎడమకాలులో నెప్పి వచ్చుచున్నది అ నెప్పి నీ కాలుదేనా ?' అని ప్రశ్నించెను ఆమె ఔనని తల వూపెను. ఐతే నేనా బాధను పోగొట్టనా ? అని ఆమె అడిగినది మేసన్ సరేనన్నది శ్రీమతి గణేశానంద, తన చేతులను ఆమె కాలుపై రెండు నిముషములుంచి, తీసినదో లేదో ఆమె కాలు నెప్పి పూర్తిగా పోయినది. తిరిగి మరెన్నడునూ నెప్పి రాలేదుట

పెగ్గీమేసన్ చాలా ఆధ్యాత్మిక పుస్తకముల రచయిత. ఈ సంఘటన తరువాత మేసన్ తన భర్తతో సహా ఇండియా వచ్చి శ్రీ సత్యసాయిబాబావారిని దర్శించెను. బాబా ఆమె నెప్పితో బాధపడునప్పుడు ఫోనుచేసినది తానే నని వివరించిరి. ఈమె భర్త కలిసి 'సత్యసాయిబాబా ప్రేమావతారి' అన్న పుస్తకమును ఇంగ్లీషులో రచించిరి. ఈమె 1983 నుండీ ఇంగ్లండు నుంచి సత్యసాయి సంస్థకు సంబంధించి ' యునైటెడ్ కింగ్‌డమ్ ' అను త్రైమాసిక ఆధ్యాత్మిక పుస్తకమును నడుపుచున్నది.

శ్రీ సత్యసాయిబాబావారు 'ధర్మక్షేత్ర' (బొంబాయి)లో నున్నప్పుడు, ఈమె మరికొందరు ముఖ్యులతో కలిసి, స్వామివెంట సముద్రపు ఒడ్డునకు వెళ్ళినది. అచట స్వామి తడి ఇసుకపై తమ వ్రేలితో ఏదో వ్రాసి, మరి రెండు నిముషముల తరువాత, తమ చేతిని ఇసుకలో చొప్పించి, పది అంగుళముల నిడివిగల బంగారు మురళీ కృష్ణ విగ్రహమును సృష్టించి తీసిరిట. ఈ లీల తాను స్వయముగా చూసితినని పెగ్గీమేసన్ వివరిస్తూ శ్రీ గోరక్‌గారు తనకు చెప్పిన మరి రెండు స్వామి లీలలను కూడా తెలియజేసినది.

## కొరత - కోత

న్యూస్ ప్రింట్ కొరత, విద్యుచ్ఛక్తి కోత వలన అనేక పత్రికలు మూతపడుతున్నాయి గత మూడు నెలలలో క్రౌన్ సైజు డబుల్ రీం పేపరు రు 90/=లు పెరిగింది. అసలు డబ్బు పెట్టినా మార్కెట్టులో పేపరు లభ్యం కావటంలేదు. కరెంటు ఎప్పుడు వస్తుందో, ఎప్పుడు పోతుందో ఎవరికి తెలియదు. గత 10 సంవత్సరాలలో ఇటువంటి "కొరత – కోత" లను శ్రీవాణి ఎన్నడు ఎదుర్కొనలేదు. అయినప్పటికి 'శ్రీవాణి'ని సకాలంలో పాఠకులకు అందించడానికి ప్రయత్నిస్తున్నాం శ్రీవాణికి న్యూస్ ప్రింట్ ప్రభుత్వ కోటా లేదు, అడ్వర్ టైజ్ మెంట్సు లేవు చిన్న పత్రికలకు ప్రభుత్వ ప్రోత్సాహం శూన్యం. కేవలం పాఠకుల ఆదరాభిమానములతో నే 'శ్రీవాణి' నడుస్తున్నది సహృదయులైన పాఠకులు తమ తమ చందాలను సకాలంలో "రెన్యూవల్" చేస్తూ, ఒక్కొక్కరూ ఒక్కొక్క "క్రొత్త చందా"ను చేర్పించి పంపుతూ "శ్రీవాణి" ని ఇంకా ప్రోత్సహిస్తారని ఆశిస్తున్నాము.

–సం.

1. డా॥ గోకక్ గారు స్వామితో చాలాసన్నిహితముగ యున్న రోజులలో ఒకసారి స్వామి ప్రయాణంలో ఆయనను, తన షేవింగ్ బ్రష్ కావాలని అడిగారుట. వెంటనే గోకక్ గారికి స్వామి భగవంతుడేనా అని అనుమానము వచ్చినదట మరి రెండు రోజులకే గోకక్ గారు అమెరికా వెళ్లట తటస్థించగా – అదే సమయానికి (తెల్లవారుఝామున స్వామి షేవింగ్ బ్రష్ అడిగిన సమయానికి) అనేకమంది ఇండ్లలో అమెరికాలో స్వామి ఫొటోలనుంచి విభూతి జలజల ఉద్భవించి పడుచుండుట చూసి గోకక్ గారు స్వామి సర్వవ్యాపకత్వమునకు ఆశ్చర్యపోయారట

తరువాత ఒకసారి ఒక పండుగముందర బెంగుళూరులో గోకక్ గారు స్వామితో మాట్లాడు పని యుండి, స్వామి గదిలోనికి వెళ్లి మాట్లాడివచ్చి అ ప్రక్కనే గల తన గదిలో కూర్చుండిరి గోకక్ గారు చూసినపుడు స్వామి గది ఖాళీగానే ఉండెను మరి రెండు గంటల తరువాత, తిరిగి పనిమీద గోకక్ గారు స్వామితో మాట్లాడుటకు స్వామి గదిలోనికి వెళ్ళగానే ఆ గది యంతయు ఆహారపదార్థములతో నింపిన (Food Buckts) బకెట్లు గది నిండుగ ఎత్తుగ పేర్చబడినవట.

ఈయన ఆశ్చర్యపడి, స్వామిని ఇవన్నీ ఇచటకు ఎట్లు వచ్చినవని ప్రశ్నించిరట 'మామూలు పద్ధతిలో మనుష్యులచే తీసికొనిరాబడలేదు' అన్నారుట స్వామి' ' ఐతే మరి ఎలా వచ్చాయి స్వామీ ?' అన్నారుట గోకక్ గారు.

'ఈ ఆహారపు బకెట్లను తీసికొనివచ్చు లారీకి మరమ్మత్తు వచ్చి ఇచటకు చేరలేకపోవుటచే, ఈ ఫుడ్ బకెట్స్‌నన్నింటినీ నేనే (Apport) ఇచటికి (ఏపోర్టు చేసి) చేసితిని' అన్నారుట స్వామి యొక్క సర్వశక్తివంతము ఎటువంటిదో గోకక్ గారు అలా వివరించారుట.

అపరేషన్ అవసరము లేకుండా, కాలు నెప్పి తగ్గించుటకు గణేశానందజీని పంపుట, తన గదిలో ఫోను ప్రయోగించుట మొ॥ అద్భుత లీలలను బట్టి పెగ్గీమేసన్ కూడా స్వామి శక్తిని, సర్వజ్ఞత్వమును, సర్వవ్యాపకత్వమును తెలిసికొంటినని సంతసించెను.

)-○-(

# కొమరగిరి కారాగార లేఖలు

(గత సంచిక తరువాయి)

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది 5-1-1977

ప్రియమైన జయ,

నేను కులాసా. శనివారం ఇక్కడకు వస్తున్నట్లు వ్రాసావు సంతోషం 'విద్య' ను గురించి ఇంతవరకు 16 లేఖలు వ్రాసాను. ఇది 17 వ లేఖ. గత 16 లేఖలలో విద్యయొక్క గొప్పతనాన్ని గురించి, జ్ఞానము విజ్ఞానము, ఆత్మజ్ఞానములను గురించి వ్రాసాను. ఈ లేఖలో 'సచ్ఛీలము' ను గురించి వివరిస్తాను.

సచ్ఛీలము ( Good Character ) = సచ్ఛీల మనగా సంస్కారం, మంచి గుణం, మంచినడత అని చెప్పుకుంటే సరిపోతుంది. ఏవ్యక్తి అయినాసరే జ్ఞానము, విజ్ఞానము, ఆత్మజ్ఞానములు లెస్సగా సంపాదించినప్పటికినీ, "సచ్ఛీలము" లేని వ్యక్తి ఎందుకూ పనికిరాడు. శీలం చెడినచో, కోట్లకొలది ప్రాపంచిక విభవములున్నప్పటికీ, మనుజునకు కించిత్తయిననూ విలువ వుండదు. శీలములేని వ్యక్తి పశువుతో సమానము శీలమే జీవునికి అలంకారము. భగవంతుని దృష్టియందు సచ్ఛీలమే ధనము, సదాచారమే సంపద. ఎంతటి జ్ఞానులైనప్పటికీ, వారికి నిగ్రహం, అణుకువ, వినయం, విధేయత, సంస్కారములు లేకపోతే నాశనమవుతారు వారు కష్టించి సముపార్జించిన ' జ్ఞాన తపస్సు ' బూడిదలో పోసిన పన్నీరువలె ఎందుకూ పనికిరాకుండా పోతుంది. మనుష్యుని విలువ అతని సౌందర్యమునందులేదు, ఆస్తిపాస్తులయందు,అంతకన్నా లేదు విద్యావైదుష్యముల యందు వుండదు. ఒక్క సచ్ఛీలమందు మాత్రమే కలదు, శక్తియందు మాత్రమే కలదు. పారమార్థిక సుగుణములయందు మాత్రమే కలదు. ప్రతి వ్యక్తి శారీరక శక్తిని సముపార్జించవలసినదే మానసిక పురోభివృద్ధిని పొందవలసినదే. ఈ రెండూ బాగా సంపాదించినప్పటికినీ, ఆ వ్యక్తికి సచ్ఛీలము లేనిఎడల ఏ రంగంలో అతను ప్రకాశించడు, రాణించడు అతని శ్రమ అంతా వృథా అయిపోతుంది.

'Character is 3/4 Religion' సచ్ఛీలమే మూడు పాళ్ల మతమని వివేకానంద చెప్పాడు. అది లేనిచో మతమునకు నామరూపాలే వుండవు, ఒకవేళ ఉండిననూ కళాకాంతులు వుండవు. ప్రస్తుతసమాజంలో చాలామంది ప్రజలు మతమునందలి బాహ్యఆచారములకే ప్రాధాన్యత నిచ్చి ఆట్టహాసం చేస్తున్నారు, పటాటోపంగా వ్యవహరిస్తున్నారు శీలమునకు ప్రాధాన్యతనివ్వటం లేదు. అంతఃశుద్ధి కలిగివుండరు. ఆడంబరంగా, పరులు మెచ్చుకోవాలనే తలంపుతో ఆట్టహాసంగా యజ్ఞయాగాది క్రతువులు, పూజలు చేస్తుంటారు. ఇటువంటివారిని గురించి వేమన చక్కగావర్ణించాడు.

"ఆత్మశుద్ధిలేని ఆచారమదియేల ?
భాండశుద్ధిలేని పాకమేల ?
చిత్తశుద్ధిలేని శివపూజలేలరా
విశ్వదాభిరామ వినుర వేమా !"

మనస్సు నిర్మలంగా లేని యాచారమెందుకు ? కుండ శుభ్రంగా కడగకుండా, దానిలో వంట చేస్తే ఏమి బాగుంటుంది ? అటులనే చిత్తశుద్ధిలేని శివపూజ కూడా నిష్ఫలమే. కనుక ప్రతి ఒక్కరూ మొట్టమొదట తన

( తరువాయి 24 వ పేజీలో )

# మనస్సాక్షి

-కొమరగిరి కృష్ణమోహనరావు

'మనఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః' బంధమునకు మోక్షమునకు మన మనస్సే కారణం మంచిచెడ్డలకు, సుఖదుఃఖాలకు మూలం మన మనస్సే. కనుక మన మనస్సును నిర్మలంగా, పవిత్రంగా ఉంచుకుంటే సదాలోచనలు, సద్భావనలు, సచ్ఛింతనలకు నిలయమవుతుంది. మన మాటలకు, చేతలకు మూలం మన ఆలోచనలేగదా ! కనుక మన మనస్సులోనికి దురాలోచనలను దూరనివ్వకుండా 'దూరాలోచనలు' చేయాలి. మన ఆలోచనలు, పవిత్రంగా, స్వార్థ రహితంగా, పదిమందికి ప్రయోజనకరంగా, విశ్వ శ్రేయస్సును కాంక్షించేవిగా ఉంటే మన మాటలూ, మన చేతలూ వాటినే అనుసరిస్తాయి.

" మనసులో నున్న భావంబు మంచిదైన
కలిగితీరును ఫలసిద్ధి కార్యమందు
మనసులో నున్న భావంబు మలినమైన
ఫలము గూడ నారీతిగ మలినమగును. "

అన్నారు. 'యద్భావం తద్భవతి' మన భావాలు సద్భావనలైతే మనం చేబట్టిన కార్యం ఆశించిన విధంగా ఫలిస్తుంది. ఒకవేళ మన భావాలు దుర్భావనలైతే, మనం చేబట్టిన కార్యం దుష్ఫలితాలనే అందిస్తుంది. సంకల్పములే మానవునికి ప్రధానమైన ఆస్తి. కనుక మన మనస్సు సత్సంకల్పాలకు, సచ్ఛింతనలకు, సదాలోచనలకు నిలయం కావాలి.

" మనిషి మాట నడత మనిషికి ఒకటైన
మనిషి వాడు కాడు మహితుడౌను. "

మనసులోని యోచన, మాటలోని సూచన - క్రియలోని ఆచరణ ఈమూడూ ఏకంకావాలి. దీనినే త్రికరణ శుద్ధి అంటారు. అట్టి త్రికరణశుద్ధి గల మనిషే గొప్పవాడు.

" మనోబలీయః ఖలుదేహశక్తేః " మనస్సు దేహశక్తికంటే బలీయమైనది. దానిని గుర్తించక 'మనిషి మారాలి ! మనిషి మారాలి !' అని నేడు వినాదానాలిస్తున్నారు మనిషి మారితే అన్ని సమస్యలూ పరిష్కృతమవుతాయని భావిస్తున్నారు. ఈ భావన పొరపాటు మనిషి మారుతనే ఉన్నాడు. పసిపిల్లవాడు కొంతకాలానికి బాలుడవుతున్నాడు. బాలుడు మరికొంత కాలానికి యువకుడవుతున్నాడు. యువకుడు కొంత కాలానికి పెద్దవాడవుతున్నాడు. పెద్దవాడు మరి కొంత కాలానికి వార్ధక్యమును రుచిచూస్తున్నాడు. తరువాత కాలగర్భంలో కలిసిపోతున్నాడు, శరీరం మారుతునే ఉన్నది మారవలసినది శరీరం కాదు. మనిషి మనస్సు మారాలి మనస్సు పవిత్రమైన భావాలకు నిలయం కావాలి. అప్పుడే సమాజంలో శాంతి సౌభాగ్యాలు విలసిల్లుతాయి.

"మనః పూతం సమాచరేత్" మనస్సుతో పవిత్రము చేయబడిన పనినే చేయవలెను. అనగా ఏ పనిని తలబెట్టినా మనస్ఫూర్తిగా చేయాలి, మనస్సుతో పెట్టి చేయాలి, అంకితభావంతో చేయాలి. అప్పుడే ఆశించిన విధంగా సత్ఫలితాలు చేకూరుతాయి. అయితే ఈనాడు చాలామంది మనస్ఫూర్తిగా కార్యాలను ఆచరించకుండా, తమ తెలివితేటలతో నటించి, పరులను మోసగించి

( తరువాయి 26 వ పేజీలో )

అంతుబట్టని అద్భుతాలు - 17

# అమెరికాను కనుగొన్నదెవరు ?

-ఖండవల్లి పర్వతాలరావు

అమెరికాను కనిపెట్టింది ఎవరు ? — అనడుగుతే అంతా కొలంబస్ అని చెప్పేస్తారు. కాని క్రిస్టఫర్ కొలంబస్ కన్నా ఎన్నో వందల యేళ్ళ క్రితమే అమెరికా ఖండంలో కాలుమోపినవారున్నారని ఇటీవల పరిశోధనలు తెలుపుతున్నాయి.

కొన్ని వందల సంవత్సరాల క్రింద యూరప్‌లో ప్రజలకు ఒక అనుమానం వుండేది. సముద్రంపై అలా ప్రయాణంచేస్తూ పోతే, చివరకు భూమి అంచు దాకా చేరి ఆపైన 'కింద' పడిపోతామేమో అని. ఇప్పుడు మనకిది హాస్యాస్పదంగా కనిపించవచ్చుగాని అప్పుడది జనం సీరియస్‌గా నమ్మిన సంగతి. హెరొడోటస్ అనే గ్రీక్ చరిత్రకారుడు ఫొనీసియన్ వీరుల సముద్రయాత్రలను గురించి కథలను రాసిన తరువాత క్రమంగా ఈ భయం పోయింది.

అమెరిగో వెస్పుచ్చి అనే ఫ్లోరెన్స్‌కు చెందిన వ్యక్తి క్రి. శ. 1497 లో తాను అమెరికా ఖండాన్ని చేరుకున్నట్లు ప్రకటించాడు. కొలంబస్ 1498 లో చేసిన పని ఒక సేడాది ముందే తాను సాధించినట్లు వెస్పుచ్చి రాసుకున్నాడు. వెస్పుచ్చి నిజానికి ఏ కొత్త ప్రాంతాన్నీ కనుక్కోలేదు. ఒక పోర్చుగీస్ ఓడలో బ్రెజిల్ తీరం వైపుగా వెళ్ళాలని ఆయన ప్రయత్నించటం వరకే జరిగింది. కాని తన సముద్రయాత్రల గురించి ఆయన రాసిన పుస్తకం మాత్రం ఆ రోజుల్లోనే 40 సార్లు పునర్ముద్రణలకు నోచుకుంది. అందులో వర్ణించిన సాహసగాథలు చదివి ప్రభావితుడై మార్టిన్ వాల్డ్‌సీ ముల్లర్ అనే పెద్దమనిషి తాను !507లో తయారు చేసిన ప్రపంచ పటంలో 'కొత్త ప్రపంచాని'కి (అంటే, వెస్పుచ్చి కనుక్కున్నానని ప్రకటించుకున్న ప్రాంతానికి) అమెరిగో వెస్పుచ్చి పేర 'అమెరికా' అని నామకరణం చేశాడు. చివరకు ఆ పేరే నిలచిపోయింది.

వెస్పుచ్చి రాసుకుంది నిజం కాదు కాని కొలంబస్ కన్న ముందే అమెరికాలో కాలు మోపినవారున్న సంగతి మాత్రం నిజమే. ఫొనిసియన్స్, వైకింగ్ జాతివారు అమెరికా చేరుకున్నట్లు రెడ్ఇండియన్స్‌లో ప్రచారంలోవున్న ప్రాచీన జానపద గీతాలు తెలుపుతున్నాయి. క్రీ. శ 980 ప్రాంతంలో ఐస్‌లాండ్‌కు చెందిన ఎరిక్ (Eric) సముద్ర ప్రయాణంచేసి కొన్ని ద్వీపాలను చూశాడు వాటికి ఆయన గ్రీన్‌లాండ్ అని పేరు పెట్టాడు. క్రీ. శ. 986 లో జార్నీ జెర్‌ఫుల్‌సన్ ఐస్‌లాండ్ నుండి ఓడలో బయలుదేరి అమెరికా తీరం దాకా వెళ్లాడు కాని ఎందుకో తీరంలో దిగకుండా తిరిగి వచ్చేశాడు. తరువాత క్రీ.శ. 1000 ప్రాంతంలో ఎరిక్ కుమారుడు లీఫ్, జార్నీ ఓడను కొని, జార్నీ ప్రయాణం చేసిన మార్గాన్నే వెళ్ళి అమెరికా తీరం చేరి, అక్కడ ఇండ్లు నిర్మించుకొని కొన్నాళ్లు నివసించాడు కూడ. అక్కడ ద్రాక్షచెట్లు (ఎవరూ పెంచినవి కావు) అధికంగా వుండటం వలన ఆయన ఆ ప్రాంతానికి వైన్‌లాండ్ అని పేరు పెట్టాడు. లీఫ్ నిర్మించిన ఇండ్ల అవశేషాలను పురావస్తుశాస్త్రజ్ఞులు కనుగొన్నారు. అక్కడికి దగ్గరలో ఇనుప కొలిముల‌ను కూడా వాళ్ల కనుగొన్నారు.

( తరువాయి 25 వ పేజీలో)

# అనువాద టెలిఫోన్‌లు

. కె. మోహన్

వెనుకటి రోజుల్లో ఒక దేశంవారు మరొక దేశం వెళ్ళినప్పుడు, లేదా భాషా ప్రాంతాలు వేరైనప్పుడు, ఒకరి భాష ఇంకొకరికి తెలియనందువల్ల పరస్పరం సంభాషించుకొనడం సాధ్యమయ్యేదికాదు అందువల్లవారు తమ వెంట రెండు భాషలూ తెలిసిన దుబాసి(ద్విభాషి)లను తీసుకొనివెళ్ళేవారు. అయితే ఆధునిక కాలంలో ఇంగ్లీష్, ఫ్రెంచ్‌వంటి అంతర్జాతీయ భాషలు అత్యధిక దేశాలవారికి తెలిసిఉండడంతో ఈ దుబాసీల అవసరం ఇపుడు అంతగా ఉండడంలేదు. అయితే మన దేశం వంటి పలు భాషలు మాట్లాడే దేశంలోని పార్లమెంట్ సభ్యులు చేసే ఆంగ్ల ప్రసంగాలకు అప్పటికప్పుడు కొన్ని ప్రధాన భాషలలోకి అనువదించి చెప్పే యంత్రాలు ఉన్నాయి ఈ అనువాద సౌలభ్యం కేవలం పార్లమెంట్ వంటివాటికే పరిమితం కాకుండా ప్రజా బాహుళ్యానికి కూడా అందుబాటులో ఉంచాలని బ్రిటిష్ టెలికాంకి చెందిన కొందరు శాస్త్రవేత్తలు సంకల్పించారు వీరు ఇంగ్లీష్, ఫ్రెంచ్, జర్మన్, స్వీడిష్, స్పానిష్ భాషలు మాట్లాడేవారికోసం ఆయా భాషలలో అప్పటికప్పుడు అనువదించి చెప్పే టెలిఫోన్‌లను రూపొందించారు. ఒక టెలిఫోన్ లైనుకి అటూ ఇటూ ఒక జర్మన్, ఒక ఇంగ్లీష్ వ్యక్తులు ఉన్నారనుకుందాం. అవతల వ్యక్తి భాష తెలియదని అనుకుందాం. అటువంటప్పుడు వారు ఈ కొత్తరకం టెలిఫోన్‌ను ఉపయోగిస్తే ఈ యంత్రం అప్పటికప్పుడు జర్మన్ వ్యక్తి మాట్లాడిన మాటల్ని ఇంగ్లీష్‌లోకి, ఇంగ్లీష్ వ్యక్తి మాట్లాడిన మాటల్ని జర్మన్‌లోకి అనువదించి వినిపింపజేస్తుంది. రెండు ఐ బి యాం పెర్సనల్ కంప్యూటర్‌ని ఉపయోగించి ఈ హైబ్రిడ్ మిషన్‌ని రూపొందించారు. ఆ శాస్త్రవేత్తలు ఈ టెలిఫోన్ ఆయా భాషలలోని 60 పదాలను ఫ్రేజ్‌లను అనువదించగలదు. పదివేల పదాలను కనుక ఈ యంత్రాలకు నేర్పితే మహామహా ఉపన్యాసాలను కూడా ఇవి సులువుగా అనువదించగలవని ఈ శాస్త్రవేత్తలు బల్లగుద్ది మరీ చెప్తున్నారు ఈ సత్కార్యానికి పూనుకొని ఈ అనువాద టెలిఫోన్లను ప్రజాబాహుళ్యానికి అందుబాటులోకి తీసుకువచ్చే ప్రయత్నాలు ముమ్మరంగా జరుగుతున్నాయి 

( 21 వ పేజీ తరువాయి )

మనస్సును స్వచ్ఛంగా, నిర్మలంగా వుంచుకోవాలి. అటుల చేసుకొనకుండా పైకి ఆర్భాటంగా చేసే పూజల వల్ల ప్రయోజనం లేదు. పైపై ఆడంబరముల వలన ఏ మతమైనాసరే, కొద్దికాలమునకే నిర్వీర్యమై, నిస్తేజమై క్షీణించిపోతుంది. ఒకవేళ ఉన్నప్పటికీ, లోన చెదలు తొలచిన, బయటకు ఆకారము మాత్రము కప్పించు డొల్లకొయ్యస్తంభంలాగే వుంటుంది. చేవలేని డొల్ల కొయ్యవల్ల ప్రయోజనంలేదుగదా! కాబట్టి బాహ్య ఆచార విచారములతోపాటు అంతఃకరణ పరిశుద్ధత్వము ఎడల కూడా అతి జాగరూకత కల్గి యుండవలెను. మిగతా విషయములు తరువాత లేఖలో వివరిస్తాను. చిరంజీవులకు నా ఆశీస్సులు.

ఇట్లు
సి. *.

మనస్సాక్షి.... ( 22 వ పేజీ తరువాయి )

బ్రతుకుతున్నారు. బాహ్యంగా, కనిపించే మనుష్యులను మోసగించుతే మోసగించగలరేమోగాని, ప్రతి వ్యక్తిలో అంతర్గతంగానున్న మనస్సును మాత్రం ఎవరూ మోసం చేయలేరు. పరిస్థితుల ప్రభావాన్ని బట్టి వ్యక్తి మోసం చేస్తూ కూడా మనస్సులో బాధపడుతునే ఉంటాడు వ్యక్తి చేస్తున్న మోసానికి, శారీరకమైన మనిషి సాక్ష్యం లభించకపోతే పోవచ్చునుగాని, మనస్సాక్షి మాత్రం మనిషిని వెంటాడుతునే ఉంటుంది. మనిషిని మధన పెడుతునే ఉంటుంది ఎవరైనా తప్పుచేస్తే మనస్సాక్షిగా చెప్పమంటారు పెద్దలు అప్పుడు ఎంతటి ఘనుడైన తడబడతాడు అతని ముఖ కవళికలు మారుతుంటాయి. మనస్సు యొక్క ప్రతిబింబం ముఖ్యం కదా! మనం ఎవరినైనా, ఎంతటి ఘనుడనయినా మోసం చేస్తే చేయవచ్చునేమోగాని, ఎవరి మనస్సును వారు మాత్రం మోసం చేసుకోలేరు "మనోమూలం మిదం జగత్" అన్నింటికీ మనస్సే మూలం కనుక అట్టి మనస్సును అదుపులో పెట్టి విశ్వాసంలోనికి తీసుకొని ముందుకు నడవాలి

"ఆత్మ బుద్ధి సుఖం చైవ" ఆత్మసాక్షిగా నడచిన వానికి సుఖం ప్రాప్తిస్తుంది. పరుల ఆలోచనల మీద ఆధారపడినవానికి దుఃఖం ప్రాప్తిస్తుంది. కనుక ప్రతి ఒక్కరూ ఆత్మ ప్రబోధాన్ని అనుసరించాలి. పరులు చేసే దూషణ భూషణలను పట్టించుకొనకుండా ధైర్యంగా ముందుకు సాగిపోవాలి మనస్సాక్షి ప్రకారం నడచుకోవాలి, మనస్ఫూర్తిగా వ్యవహరించాలి.

( ఆకాశవాణి సౌజన్యంతో )

అంతుబట్టని.... ( 23 వ పేజీ తరువాయి )

జాప్నే, లీఫ్‌ల కన్నా ముందే - అంటే క్రీస్తుకు పూర్వమే ఆఫ్రికా దేశానికి చెందిన నీగ్రోలు అమెరికా చేరుకున్నట్లు తెలుస్తోంది. లావెంటా అన్నచోట త్రవ్వగా పెద్ద పెద్ద రాతి తలకాయలు కనిపించాయి. ఒక్కొక్కటి 14 టన్నుల బరువున్న ఈ తలకాయలు ముమ్మూర్తులా నీగ్రో తలకాయల్లా వుండటం విశేషం. స్పెయిన్ దేశస్థులు అమెరికాకు నీగ్రో బానిసలను ఆఫ్రికా నుంచి కొనిపోవడం మొదలయింది 16 వ శతాబ్దంలో. కనుక, క్రీస్తు పూర్వమే నీగ్రోలు ఎలాగో అమెరికా చేరుకొని ఓల్మెక్ నాగరికతలో ఉన్నత స్థానాన్ని సాధించి వుండాలి క్రీ శ. అయిదవ శతాబ్దానికి చెందిన చైనావారి తలకాయలున్న బొమ్మలు మెక్సికోలో లభించాయి అమెరికాను కనుగొన్నది చైనావారేనని చైనా ప్రకటించింది కూడా. క్రీ. పూ. 2500 ప్రాంతానికి చెందిన కుండలను యితర మట్టి పాత్రలను ఈక్వెడార్ ప్రాంతంలో కనుగొన్నారు ఆ రోజులకే చెందిన జపాను దేశపు మట్టి పాత్రలను అవి పోలి వుండటంతో క్రీ పూ. 2589 ప్రాంతంలోనే అమెరికాతో జపాన్ వారికి సంబంధాలుండేవా ? అన్న అనుమానం కలుగుతోంది. అంతేకాదు, 40,000 సంవత్సరాల క్రితం ప్రస్తుతం బేరింగ్ జలసంధిగా వున్న ప్రాంతం మంచుతో కప్పబడి, భూ మార్గంలా ప్రయాణానికి అనువుగా వుండేదని, అప్పుడు జపాన్ నుండి అమెరికాకు భూ మార్గంగా రాకపోకలు సాగి వుంటాయని ఊహిస్తున్నారు. ○

ఉగాది సందేశము ( 3 వ పేజీ తరువాయి)

కనుక మానవుడు ఈనాడు అహంకార మమకారములను అదుపులోపెట్టుకోవటానికి ప్రయత్నించాలి కోరికలనేవి ఎంతటివారినైనా పతనం చేస్తాయి

అర్జునుడు చాలా మేధావి. అతను అనేక బిరుదులు పొందినాడు. అలాంటి అర్జునుడు కూడనూ క్షణంలో ఈ వ్యాధికి గురి అవుతున్నాడు. 'స్వ' .... 'స్వ' - అనే పదంతోనే బంధింపబడుతూవచ్చాడు ఏమిటి ఈ 'స్వ' ? 'స్వ' అనగా స్వజనులు, స్వబంధువులు. నా వారు .... నా వారు, ఈ అభిమానం చేతనే తన గాండీవమును కూడను క్రింద పడవైచి, భీరువై దుఃఖించుచూ వచ్చాడు కారణం ? ఈ అభిమాన

మమకారములే, ఇవి ఏ క్షణంలోనైనా, ఎంతటి వారినైనా వశం చేసుకుంటాయి. కనుక అభిమాన అహంకారములను కొంతవరకు అదుపులో పెట్టుకొనుటకు ప్రయత్నించాలి. 'ప్రేమ' అనేటటువంటి భగవంతుని యొక్క సొత్తును, కేవలం మానవుల వరకు మాత్రమే పరిమితం గావించక, సర్వజీవులకు దీనిని ప్రసరింపజేయాలి. ప్రేమకు మించిన శక్తి మరొకటి లేదు. ఇది చాలా బలమైన శక్తి. అయితే దురదృష్టవశాత్తు ఈ ప్రేమకు అనేక అపార్థములు ఆపాదించి, యదార్థములను విస్మరించి దుఃఖములకు గురిఅవుతున్నారు ఈనాటి మానవులు. ఈనాటి మానవులు ప్రతిఫలాపేక్షతో భగవంతుని ప్రేమిస్తున్నారు. ఇది నిజమైన ప్రేమకాదు. 'నా తల్లి నా తండ్రి, నా పుత్రుడు, నా మిత్రుడు' అని అందర్నీ ప్రేమిస్తున్నట్లుగా నటిస్తున్నారు. ఇవి అభిమానములు కాని, ప్రేమలు కావు. 'ప్రేమ' అనగా ఏమిటి? ఎట్టి ఫలమును ఆశించక, ఉపకారం చేసేటటువంటి తత్త్వమునకే 'ప్రేమ' అని పేరు. భగవంతుడే నిజమైన స్నేహితుడు. ఎట్టి ఫలితమునూ ఆశించక, అన్ని సమయములయందునూ నీకు తోడు నీడగా వుంటుంటాడు. నీ నుండి ఎట్టి ఫలమునూ ఆశించడు, వృద్ధాప్యంలో తమను చూస్తారనే ఆపేక్షతోనే కుమారులను తల్లిదండ్రులు ప్రేమిస్తుంటారు. కాని భగవంతుని ప్రేమ మాత్రం ఇటువంటిది కాదు. దైవ ప్రేమ ఒక్కటే స్వార్థరహితమైనది ప్రేమ. అసలు ప్రేమకు నానార్థములనేటటువంటివి లేనేలేవు. ఒకే అర్థము. ఇదియే హృదయానికి హృదయము. అయితే ఇలాంటి స్వార్థ రహితమైన ప్రేమను గుర్తించుకోలేకపోతున్నారు ఈనాటి ప్రజలు.

ఒకానొక సమయంలో ధర్మజుడు రాజ్యమును వదలి ద్రౌపదీ సమేతుడై హిమాలయములలో కాలం గడుపుతున్నాడు. కన్నీటి ధారలతో ద్రౌపది 'నాథా! సమస్త ప్రజానీకానికీ అన్నమును ప్రసాదించి, దుర్భిక్షమును దూరం చేసి, ధర్మమును కాపాడుతూ దానములు గావించిన నీకు ఈ కష్టములకు కారణమేమిటి? సాక్షాత్ ధర్మస్వరూపునికా ఇట్టి కష్టములు రావటం? ఇప్పుడు పట్టెడు అన్నముతో పొట్ట నింపుకోలేక పోతున్నారుగదా? ఈ కష్టములకు కారణమేమిటి? భగవంతుని అనుగ్రహం లేకపోవటమా? లేక నీ భక్తిలోనున్న దోషమా? కారణమేమిటి?' అని ప్రశ్నించింది. ధర్మజుడు చిరునవ్వు నవ్వుతూ 'ద్రౌపదీ! చూడు! ఈ హిమాలయ పర్వతములు ఎంత అందంగా ఉంటున్నాయి! ఇవి నాకు ఏ ఆనందాన్ని అందిస్తున్నాయి? నాకేసహాయాన్ని అందిస్తున్నాయి. ఏమీ చేయటంలేదు. కాని వీటిని చూచిన తక్షణమే నాకు ఆనందం ఆవిర్భవిస్తున్నది. 'అందమె ఆనందం, ఆనందమె జీవిత మకరందం' అన్నాడు ఒక కవి. అందమే ఆనందమునందిస్తుంది. దానికి మించిన ఆనందం మరొకటి లేదు. ఒక పుష్పమును చూస్తాం. కాని ఆ పుష్పం మనకు ఏమీ సహాయం చేయటంలేదు కాని, ఆ పుష్పమును చూచిన తక్షణమే మనకు ఎంతో ఆనందం వేస్తుంది. కాబట్టి భగవంతుడు ప్రకృతి స్వరూపుడు. ఈ ప్రకృతిని చూచిన తక్షణమే ఆనందం వేస్తుంది. ఈ ఆనందం నిమిత్తమే అతనిని నేను ప్రేమిస్తున్నాను గాని, ప్రతిఫలాపేక్షతో కాదు. కనకనే వేదము "న కర్మణా, న ప్రజయా, ధనేన త్యాగేనైకే అమృతత్వ మానశుః" అని చెబుతున్నది. ఈ త్యాగభావము చేత, ఈ ప్రేమస్వరూపుని చూచినప్పుడే, అన్ని ఫలితములు చేకూరుతున్నాయి. కనుక భగవంతుని ప్రేమించేదే నిజమైన ప్రేమ గాని ప్రతిఫలాపేక్షతో ప్రేమించేటటువంటిది కాదు. ప్రేమనిమిత్తమై ప్రేమ. ఇది వాణిజ్యపదార్థము కాదు. ప్రాకృతమైన వస్తువాహనములయందు, భౌతికమైన పదార్థములయందు, లౌకికమైన ఈ జీవితమందు, వచ్చి పోయేటటువంటి సుఖ దుఃఖములు కేవలం కదిలిపోయేటటువంటి మేఘముల వంటివి. కనుక ఈ దేహముతో కూడినటువంటి ఆనందం సరియైన ఆనందంకాదు. దేహమే అశాశ్వతము. అలాంటి అశాశ్వతమైనటు

వంటి దేహముతో అనుభవించేటటువంటి ఆనందం శాశ్వతమెట్లా అవుతుంది ? ఈ దేహములు మార్పు చెందేటటువంటివి. మార్పు చెందటమే కాదు, మాలిన్య ముతో కూడినటువంటివి. కనుక ఈ అశాశ్వతమైన దేహమును గురించి చింతించక హరిని గురించి చింతించు. జీవితంలో మనం సాధించవలసింది భగవంతుని ప్రేమ. అతని ప్రేమ ఒక్కటి ఉంటే చాలు. సర్వమునూ సాధించినవారమవుతాం. కనుక ఆ ప్రేమ నిమిత్తమై నీవు చింతించు లౌకికమైనటువంటి, క్షణభంగురమైనటు వంటి నా కష్టములను గురించి నీవు చింతించనవసరం లేదు అన్నాడు ధర్మజుడు

" దేహము పాంచభౌతికము.... ఆ దేహియే దేవ దేవుడు " ఆ దైవత్వమును పొందే నిమిత్తమై నీవు చింతించు, ఆ దైవత్వము యొక్క ఆనందం ఇట్టిది. . అట్టిది అని ఎవరూ వర్ణించలేరు. అవాఙ్మానస గోచర మైనటువంటిది. మనస్సుకుగాని, వాక్కుకుగాని అందనిది ఆనందం. ప్రాకృతమైనటువంటి ఆనందం పరిమితులలో ఉంటుంది. ప్రాకృతమైన సంబంధం ఒక పరిమితులలో ఉంటుంది ఇది పరిమితులకు అతీతమైనటువంటిది. అదియే దైవానందం, అదియే నిత్యానందం, అదియే యోగానందం, అదియే అద్వైతానందం కాని ఈనాటి సాధ కులు క్షణభంగురమైన, తుచ్ఛమైన ఆనందం నిమిత్తమై అనేకవిధమైన సాధనలు సల్పుతున్నారు దీనిని 'సాధన' అని చెప్పటం కూడా అవమానమే. సా....ధన - సాధన అనగా ప్రయత్నముతో సంపాదించుకొనినటు వంటిది. ధనము మాత్రమే కాదు, విద్య కూడా ఒక ధనమే. ఆరోగ్యమూ ఒక ధనమే, మన సర్వ శక్తులూ ధనమే, ధన కనక వస్తు వాహనాదులూ ధనమే. ధనమనగా ఏమిటి ? మానవజీవితంలో సాధించి నటువంటివి ధనములు ఎట్టి సాధనలతో మనం సాధించి నటువంటివి ? అదే సా....ధన. సాలోక్య, సారూప్య, సామీప్య, సాయుజ్యములు అదే 'స' కారము. దైవత్వ ముతో సాధించినటువంటి ధనమే నిజమైన ధనము.

కనుక అటువంటి ధనమును అందించే నిమిత్తమై, యుగయుగములయందు దైవము అవతరిస్తూ ఉంటాడు.

కృతయుగము వైశాఖ మాసములో ప్రారంభమైంది త్రేతాయుగము మాఘమాసములో, ద్వాపరయుగము మార్గశిర మాసములో ప్రారంభమైంది. అందువలననే కృష్ణుడు మాసములలో మార్గశిర మాసమును నేను అన్నాడు కలియుగము చైత్రమాసములో ప్రారంభ మైంది. ఈ చైత్రము కూడనూ చాంద్రమాసములో అయింది కాని, సూర్యమాసములో కాదు యుగమనగా ఏమిటి ? 'యుగ' మనగా దైవత్వమని - అర్థము. దివ్యత్వమనేది దివ్యత్వము నుండే వచ్చింది. దైవత్వముతోనే ప్రారంభమై, దైవత్వముతోనే అంత్యమయ్యేటటువంటివే ఈ యుగములు యుగములు భగవంతుని యొక్క సృష్టి యుగములకు ఆది ఈ 'యుగాది' పోషించేటటువంటివాడు తానే, ఈ కాల స్వరూపమే తాను. కనుకనే భగవంతునకు 'ఆత్మ' అనేటటువంటి దాంట్లో కాలముతో కూడినటువంటివాడు. కనుకనే భగవంతుని 'కాలాత్మ' అని పిలుస్తూవచ్చారు. కాలము కాయాన్ని మింగుతుంటే, కాలాన్నే మ్రింగే టటువంటివాడు భగవంతుడు కనుకనే ఈ కాలము నకు 'సంవత్సరాయ నమః' అన్నిపేరు పెట్టారు. సంవత్సరమనగా భగవత్స్వరూపుడు అని అర్థము భగవంతునకు మరొక పేరు 'సంవత్సర స్వరూపుడు' అని ఇలాంటి అనేక అంతరార్థములతో కూడిన యుగాదినందు మనం కేవలం కొన్ని మాసములతో, కొన్ని గడియలతో, కొన్ని క్షణములతో ఆనందమును పొందేటటువంటి దానిని 'యుగాది' గా మనం భావిస్తు న్నాం. కనుక మనకు ఇది కాదు 'యుగాది' 'యుగ' దైవముతో ప్రారంభమైనటువంటిదే మనకు యుగము. దీనికి అంత్యమేలేదు ఇలాంటి, అనిర్వచనీయమైనటువంటి, అమృతమైనటువంటి, అమరత్వమైనటువంటి, దివ్యత్వ మైనటువంటి ఈ సంవత్సరమునకు మనం ఒక్క దినం సంవత్సరం ప్రారంభమైనట్లుగా భావించడం - ఇది కేవలం ఒక అల్పత్వమే.

ఈనాడు యుగాది ప్రారంభమైనదని భావిస్తున్నారు. ఇది కలియుగము యొక్క ప్రారంభం అని. 'కలి' అనగా ఏమిటి? నామముతో నిండినటువంటిది కలి. ఈ కలియుగమునందు నామస్మరణకంటె మించినది మరొకటిలేదు. కాని ఈనాటి మానవుడు 'హరి' నామమును విస్మరించాడు. 'సిరి'నామమును స్మరిస్తున్నాడు. 'సిరి' అభీష్టము కల్గినటువంటివారే అధికంగా కనిపిస్తున్నారు కాని 'హరి' అభీష్టము కలిగినటువంటివారు తక్కువ. కనుక మనకు 'హరి' కావాలి కాని 'సిరి' కాదు. 'హరి' వుంటే 'సిరి' మన వెంట వస్తునే ఉంటుంది. సర్వమునకూ భగవంతుడే మూలకారణం. ఇలాంటి మూలాధారమైనటువంటి దైవత్వాన్ని మనం స్మరిస్తూ రావాలి. ఈనాటి సంవత్సరమునకు పేరు 'యువ'. 'యువ' అంటే ఏమిటి? యవ్వనంలో వున్నటువంటివారిని 'యువ' అని అంటారు అతనినే 'యువకుడు' అని అంటారు. అనగా ఇది మధ్యలో వచ్చిపోయేటటువంటిదే. యవ్వనం అనేది ప్రారంభములో రాదు, అంత్యములో వుండదు. ఇది వచ్చిపోయే మేఘాల వంటిది. ఇలాంటి యువనామ సంవత్సరంలో ఫలితములు ఏవిధంగా వుంటాయోనని ప్రజలు ఆందోళన చెందుతున్నారు. ఈ యువనామ సంవత్సరం శనిలో ప్రారంభమైంది. కాని గురుడు చాలా మంచివాడుగా ఉన్నాడు, అతనే రాజు రాజు మంచివాడుగా ఉన్నప్పుడు ఇంక మంత్రులు ఎలాంటివారైతే మనకేం? కనుక మనం ఏం భయపడనవసరంలేదు. అయితే ప్రపంచం లోపల కొన్ని కష్టములు, నష్టములు, సుఖములు, దుఃఖములు జరుగుతూనే ఉంటాయి కృతయుగంలో మాత్రం బాధలు రాలేదా? త్రేతాయుగంలో కష్టములు సంభవించలేదా? ద్వాపరయుగంలో యుద్ధములు జరుగలేదా? కనుక కలియుగమనేటటువంటి దానిని ప్రత్యేకంగా చూచుకోనవసరంలేదు. కృతయుగమునందు కూడనూ కలియుగ పురుషులుండేవారు. కలియుగమునందు కూడనూ కృతయుగ పురుషులుంటారు. కనుక యుగములు దీనికి మూలకారణం కాదు. హృదయములు మూలకారణం. హృదయములు మంచివైతే ఏ యుగమైతే మనకేం? కనుక హృదయాన్ని పరిశుద్ధం గావించుకొనే ప్రయత్నం మనం చేయాలి. హృత్ + దయ = హృదయ అన్నారు. దయతో కూడినటువంటిదే హృదయం కావాలి, కఠినమైనటువంటి హృదయం వుండకూడదు. కనుక కఠిన హృదయమును దూరంచేసుకొని, కరుణహృదయమును తెచ్చుకోవటానికి ప్రయత్నించాలి. కనుక ఈ సంవత్సరం లోపల మంచి చెడ్డలకు రెంటికీ మనం తలవంచవలసిందే. ఈ సంవత్సరంలో చాలా ప్రమాదములు ఎక్కువగా ఉంటాయి. అల్లకల్లోలములు అధికంగా ఉంటాయి. రాజకీయమైనటువంటి బాధలు చెప్పడానికి వీలుకానటువంటివిగా ఉంటాయి. కనుక ఎవరికివారు పవిత్రమైన హృదయాన్ని పెంచుకొని, తమకు తాము రక్షించుకోవటానికి తగిన కృషి చేయాలి. గురువు నిన్ను గమ్యాన్ని చేర్చలేడు. దైవము నిన్ను గమ్యాన్ని చేర్చలేడు. గ్రంథములు నిన్ను గమ్యాన్ని చేర్చలేవు కాని గమ్యాన్ని చేరటానికి నీకు నీవే నడవాలి. గైడ్‌పోస్టు ఉంటుంది. ఈ గ్రామానికి ఇది మార్గం.... ఈ గ్రామానికి ఇది మార్గం అని చూపటమే దాని తత్త్వముగాని, నడిపించడం దాని బాధ్యత కాదు. కనుక ఎవరికివారు స్వప్రయత్నంతో సుఖాన్ని ఆనందాన్ని పొందటానికి ప్రయత్నం చేయాలి. దైవానుగ్రహమునకు కృషి చేయాలి, దైవప్రార్థనలు సలపాలి ఈ సంవత్సరం యువకులు అతిజాగ్రత్తగా ఉండాలి. మనసును అదుపులో ఉంచుకోవాలి. క్షణంలో కోపం, క్షణంలో అసూయలను అభివృద్ధి గావించుకో రాదు క్షణంలో వచ్చి క్షణంలో పోయే క్రోధం చాలా ప్రమాదం. క్రోధాన్ని చాలావరకు చంపుకోవటానికి ప్రయత్నించాలి. అసూయ మరింత నయం కా రోగం. ఈ అసూయ రోగము చాలావరకు ప్రా పోయింది. కాన్సర్ వ్యాధికయినా నివారణ వున్న

గాని అసూయకు నివారణలేదు. కనుక అసూయకు మనం ఏమాత్రం గురికాకూడదు. ఈ అసూయచేతనే మనకు అనేక రకములైన బాధలు సంభవిస్తున్నాయి.

భగవంతుడెవరు? ఎక్కడున్నాడు ధర్మస్వరూపుడు? ఎవడు యముడు? ఎవడు రాముడు? చక్కగా విచారణ చేయాలి. పురందరదాసు కూడా చెప్పాడు ఎవడురా నీకు యముడు? ఎవడురా నీకు రాముడు? నమ్మని రావణాసురునకు యముడు రాముడు, నమ్మిన విభీషణునికి రాముడే దేవుడు నమ్మని క్రూరసేనునకు కృష్ణుడే యముడయ్యాడు, నమ్మిన అక్రూరునకు కృష్ణుడు దేవుడుగా కనిపించాడు నమ్మిన ప్రహ్లాదునకు నారాయణుడుగా కనిపించాడు నమ్మని హిరణ్యకశిపునకు యముడుగా కనిపించాడు యముడు వేరు రాముడు వేరు కాదు దేముడు వేరు యముడు వేరు కాదు దేముడే యముడు, యముడే రాముడు కనుక యముడు ప్రత్యేకంగా, దేముడు ప్రత్యేకంగా లేడు. మన భావముల దోషముకే యముడుగా మారుతున్నాడు. తన భావములయొక్క మంచికే దేముడుగా మారుతున్నాడని చెప్పాడు. కనుక

'No' అనువానికి 'No' అనురా
'Yes' అనువానికి 'Yes' అనురా
'No' 'Yes' లు మన నోటికే కాని
సాయికి సర్వము 'Yes', 'Yes, 'Yes'

కనుక మన హృదయములో నున్న దోషములేగాని భగవంతునకు ఏమాత్రం Yes, No లు లేవు కనుక మనకు ఎలాంటి సంవత్సరమొచ్చినప్పటికినీ, మన హృదయాల లోపల 'కరుణ' ను పెంచుకోవాలి దైవచింతనను అభివృద్ధి పరచుకోవాలి దైవచింతన ఒక్కటే వుంటే చాలు దేనినైనా మనం సాధించవచ్చును ఈనాడు ఒక్క క్షణంలో వుండిన మంచితనం మరో క్షణంలో మారిపోతున్నది ఉపకారికి అపకారిగా మారిపోతున్నారు. ఎన్ని ఉపకారములు చేసినప్పటికినీ, ఆ ఉపకారములను మరచిపోవటమేగాక, అపకారములు చేయడానికి కూడా పాల్పడుతున్నారు.

ఘోరీమహమ్మద్ పలు పర్యాయములు దండెత్తి వచ్చినా క్షమించి వదలిపెట్టాడు పృథ్వీరాజ్. 17 వ సారి పృథ్వీరాజ్ మామ అయిన జయచంద్రుని సహాయంతో దండెత్తి వచ్చి పృథ్వీరాజ్‌ను ఓడిస్తాడు పలు పర్యాయములు క్షమాభిక్ష పెట్టి వదలివేసిన పృథ్వీరాజ్ కన్నులనే తీసివేయిస్తాడు కృతఘ్నుడైన ఘోరీ కృతజ్ఞత లేకపోవటమేగాక, కృతఘ్నుడయినాడు ఘోరీ. కృతజ్ఞులం కావాలి కాని కృతఘ్నులం కాకూడదు ఉపకారికి అపకారం తలపెట్టరాదు అటువంటి కృతఘ్నులను భగవంతుడు ఏదో ఒక రోజున శిక్షిస్తాడు కొంతకాలం తరువాత పృథ్వీరాజ్ మంత్రి ఘోరీ పెద్దకుచేరి పృథ్వీరాజ్‌కు శబ్దవేది విద్య వచ్చునని చెప్పి ప్రదర్శన ఏర్పాటు చేయిస్తాడు ఘోరీకి ప్రక్కగా గంటను పెట్టి మ్రోగించగా, శబ్దమును బట్టి నూరు అడుగుల దూరంలో నున్న ఆ గంటను కొడుతాడు పృథ్వీరాజ్ ఘోరీ ఆశ్చర్యపోతాడు. మంత్రి ముందుగానే ఏదో పథకం వేసాడని అనుమానిస్తాడు, మరొక పర్యాయం ఆ గంటను తనకు ముందుగా పెట్టించి మ్రోగించి కొట్టమంటాడు ఘోరి పృథ్వీరాజ్ వదలిన బాణం గంటను ముక్కలుచేసి, ఆ గంటకు వెనుక కూర్చొనిన ఘోరీ కంఠములో దూసుకొనిపోతుంది ఘోరీ ప్రాణం విడుస్తాడు 'చెరపకురా చెడెదవు' ఇతరులను చెరపడానికి ప్రయత్నించుతే, దైవం మనలనే చెరుపుతాడు. కనుక మనం ఎవరినీ చెడ్డగా భావించరాదు ఎవరిపైనా చెడ్డ తలంపులను అభివృద్ధి చేసుకోరాదు ఎవరికీ చెడును చేయరాదు. సాధ్యమైనంతవరకు మంచినే చేయాలి మన మంచే మనల్ని కాపాడుతుంది

మన మనస్సులలో నున్న అనుమానాలను నిర్మూలనం గావించుకోవాలి విశ్వాసాన్ని పెంచుకోవాలి. ఈనాడు విశ్వాసం సన్నగిల్లిపోతున్నది అనుమానం

పెరిగిపోతున్నది. ఏది చూచినా అనుమానమే. ఈ అనుమానంతో బ్రతికేవ్యక్తి ఎంతకాలం బ్రతుకగలడు? దైవ విశ్వాసాన్ని పెంచుకోవాలి. ఆ దైవ విశ్వాస ముండినంతవరకు మిమ్ము ఏ కలి హింసించదు. సత్య వాక్కుచేత, దానంచేత, మంచి శ్రవణంచేత, ఈ కలిని మనం జయించడానికి ప్రయత్నించాలి. 'కంఠమునకు నెక్లెస్ కాదు అలంకారం, సత్యమే అలంకారం. చేతికి కంకణాలు కాదు అలంకారం, దానమే అలంకారము. చెవులకు రింగులు కాదు అలంకారం, భగవత్ నామాన్ని. వినటమే అలంకారం. ఈ అలంకారములకు మించిన అలంకారం మరొకటి ఏమి ఉంటుంది? కనుక మనం ఇది సాధించవలసినది, సంపాదించవలసినది. అప్పుడు మన జన్మ సార్థకమవుతుంది.

మానవుడు దేనికోసం వచ్చాడు? ఎందుకోసం నేను పుట్టాను? తినటం కోసమా? ధనం సంపాదించడం కోసమా? మిద్దెలు, మేడలు కట్టటానికోసం పుట్టానా? ఇవన్నీ ఉండవలసిందే, కాని నా రహస్యమేమిటో? నా మానవ జీవితమేమిటో? నా కర్తవ్యమేమిటో? – అనేటటువంటి ప్రశ్నలు వేసుకొని, దీనితో ఆదర్శవంతమైన జీవితాన్ని జగత్తుకు అందించాలి. ప్రతి మానవుడు తన జీవితంలో సాధించవలసిన కర్తవ్యాలు కొన్ని ఉంటున్నాయి. కర్తవ్యకర్మలనాచరిస్తూ మానవత్వాన్ని సార్థకం గావించుకొనే పనులను మనం చేయాలి.

దైవం ప్రత్యేకంగా ఎక్కడనో లేడు, ఈ దేహం నడిచే దేవాలయమన్నారు, దీనిని ఎవరు నడిపిస్తున్నారు? ఆ దైవమే నడిపిస్తున్నాడు. అదియే నీలోనున్నటువంటి Vibration. ఎక్కడ నడవాలని చెప్పే తెలివితేటలను అందిస్తున్నాడు. ఈ తెలివితేటలే Radiation. ఈ రేడియేషన్, వైబ్రేషన్లను రెంటిని ఉపయోగపెట్టుకొని చేసేటటువంటి పని ఈ దేహమే Meterialisation. కనుకనే 'భూర్భువః స్వః' ఈ మూడూ నేనే భూలోక, భువర్లోక, సువర్లోకములంటే ఎక్కడో వుంటున్నాయని కాదు – భూలోకమనేటటువంటి ఈ దేహమునందే, భువర్లోకమనేటటువంటి ప్రాణము, సువర్లోకమనేటటువంటి జ్ఞానములు రెండూ ఉంటున్నాయి. సర్వమూ మనయందే ఉంటున్నాయి. చిన్న అద్దము ద్వారా కొన్ని కోట్ల మైళ్ళ దూరాననున్న నక్షత్రములను చూడగలుగుతున్నాం. అదే విధముగనే ఈ చిన్న దేహం లోపల విశ్వమంతా ఇమిడిఉంటున్నది. ఇదియే సృష్టి యొక్క రహస్యం. ఈ రహస్యమును విచారిస్తే భగవంతుడు ఎంత గొప్పవాడో అర్థమవుతుంది. నాలుకపైన నున్న రక్తమే దేహమంతా ప్రసరిస్తున్నది. చేతిలో వుండేది, నాలుకపైన వుండేది ఒకే రక్తమే కాని, లడ్డూని తీసుకొనివెళ్ళి చేతిలో పెడితే రుచి చెప్పలేదు. నాలుకపైన పెడితేనే చెప్పగలదు. ఒక్కొక్క స్థానంలో ఒక్కొక్క విలువను సృష్టిస్తూవచ్చాడు. కన్నులు చూడగలవేగాని వినలేవు. చెవులు వినగలవేగాని చూడలేవు. నోరు తినగలదేగాని వినలేదు. భగవంతుడు ఒక్కొక్కదానికి ఒక్కొక్క శక్తినందించాడు. ఇది ఎవరు చేయగలరు? ఇది ఎవరిచేతనౌతుంది? ఒక్క భగవంతునికి మాత్రమే ఇది సాధ్యమవుతుంది. అట్టి దైవానుగ్రహం చేత మనం సాధించలేనిదంటూ లోకంలో లేదు. అది నా మనస్సు ఇది నా బుద్ధి – ఇవన్నీ పనిముట్లు. కాని నీవు దానికి మాష్టర్‌వి. ఆ భావాన్ని మీరు విశ్వసించాలి. అన్నింటికీ 'ఆత్మ' అనేటటువంటి ఒక మాష్టర్ ఉన్నాడు. అతనికి ద్రోహం చేయరాదు. మోసం చేయరాదు. అతనికి మనం కృతజ్ఞులముగా ఉండాలి. ఇలాంటి పవిత్రమైన, విలువైన, దేహమును మనకందించాడు. దైవానుగ్రహం లేకుండా ఏదీ జరుగదు. అన్నింటికినీ దైవముండాలి. ఆ దైవ విశ్వాసమును మనం పెంచుకోవాలి.

ప్రాచీనకాలమునుండి ఆధ్యాత్మిక సంపత్తిని అన్ని దేశములకు అందించిన దేశం ఈ భారతదేశం. "లోకా స్సమస్తా సుఖినో భవంతు" అని

చాటింది మన భారతీయ సంస్కృతి. ఇంతటి పవిత్రమైన సంస్కృతిని మనం ఉంచుకొని, ఇంతటి దివ్యమైన ఆదర్శములు మనలో ఉండినప్పటికినీ, ఈనాడు భారతీయుడు తనను తాను తెలుసుకోలేకపోతున్నాడు. కారణమేమిటి? ఈనాటి విద్యల యొక్క ప్రభావం. ఈనాటి పరిచయముల ప్రభావం. ఈనాటి సంఘములోని దోషములు, దీనివలన మనలోనున్న దివ్యత్వాన్ని మనం మరచిపోతున్నాం.

ఆధ్యాత్మికశక్తిని సంపాదించిన మహర్షుల దేహం చుట్టూ ఒక ప్రకాశం కనిపిస్తూ ఉంటుంది. దేహంలో శక్తి ఉంటున్నది. పెంట్రుకలు కూడా ఎలక్ట్రికల్ వైర్‌లాగే ఉంటాయి. ఈ యోగశక్తిని సంపాదించిన మహనీయులను ముట్టుకుంటే 'షాక్' కొట్టినట్లవుతుంది. ఇంతటి శక్తిని ఎవరు అందించారు? ఎక్కడినుంచి తెచ్చారు? ఇది దైవత్వమునుంచి ఆవిర్భవించినదే. దైవశక్తి ఇట్టిది, అట్టిదీ అని ఎవరూ వర్ణించలేరు, కనుక దైవానుగ్రహమునకు తగినటువంటి ప్రార్థనలు మనం సల్పాలి. ఈ యుగాలను గురించి, సంవత్సరాలను గురించి విచారించనవసరంలేదు. దైవానుగ్రహం గనుక ఉంటే దేనిని గురించి ఆలోచించాల్సిన అవసరం లేదు. సర్వమునూ సాధించవచ్చును. త్యాగరాజు చెప్పాడు. "ఓ రామా! నీ అనుగ్రహం ఒక్కటి ఉంటే చాలు. నవగ్రహములు నాకు హస్తగతమైపోతాయి" అన్నాడు, గ్రహములు నవగ్రహములని, అష్టగ్రహములని అనుకుంటున్నారు. గ్రహములు ఎనిమిది కాదు, తొమ్మిది కాదు రెండే. రెండు గ్రహాలుంటున్నాయి. అహంకార మమకారములే ఆ రెండు గ్రహాలు. ఇవి మనల్ని పిశాచములలాగే పట్టి పీడిస్తున్నాయి. వీటినుంచి విమోచనం పొందాలంటే అనుగ్రహమనేదానిని మనం సంపాదించాలి. అనుగ్రహబలం ఒక్కటి వుంటే ఈ గ్రహములు మనల్ని ఏమాత్రం పీడించలేవు. ఎవరి అనుగ్రహం? దైవానుగ్రహం. కనుక ప్రతి ఒక్కరూ దైవానుగ్రహ బలమును సంపాదించాలి.

ఈ సంవత్సరంలో యువకులందరూ పవిత్రమైన కర్మలలో పాల్గొనాలి. సమాజంలోని సమస్యలను కొంత వరకు పరిహారం చేయాలి. ఐకమత్యమును పెంచుకోవాలి. ఆడంబరములను త్రుంచుకోవాలి. అహంకారాన్ని చంపుకోవాలి. అప్పుడే దివ్యత్వమనేటటువంటి యువకత్వమును అభివృద్ధి గావించుకోవచ్చు. ఈనాడు ఈ యువకుల లోపల ఏకత్వం పోయింది. అహంకారమే దీనికి మూలకారణం. 'నేను .... నేను' .... అనే భావం పెరిగిపోతున్నది. కన్నులలో కొండలుండినంత వరకు మానవత్వం పూర్తిగా మరచిపోతుంటారు. 'నేనే' అందరి కంటే గొప్పవాడనని భావిస్తాడు. అది కాదు. వచ్చేటటువంటి కష్టములకు, నష్టములకు తట్టుకొని ముందుకు సాగటానికి తగినటువంటి ధైర్యాన్ని సంపాదించాలి. "ధైర్యం సర్వసాధకమ్" ఆ ధైర్యాన్ని మనం వహించాలి. ఏ ధైర్యం? భుజబల ధైర్యం కాదు, బుద్ధిబల ధైర్యం కాదు, ధనబల ధైర్యంకాదు. దైవబలం కావాలి. ఆ దైవబలం వచ్చినప్పుడే అన్నిటినీ సాధించగలవు. కనుక మీరందరూ దైవబలంకోసం ప్రయత్నించండి. ప్రపంచంలోని సర్వ దేశములు సుక్షేమంగా ఉండాలని ప్రార్థించండి. 'నా భారతదేశం' అనే సంకుచిత భావానికి చోటివ్వకండి. అందరూ మానవులే, అందరినీ మనం ప్రేమిస్తూ రావాలి. ఏ దేశంవారైనా భగవంతుని బిడ్డలేగదా! దేశములు వేరైనా, మానవుల రంగులు వేరైనా, మానవజాతి అంతా ఒక్కటే అనే విశాల భావాన్ని పెంచుకోవాలి. ఈ సంవత్సరం ప్రేమను పెంచుకోవటంలో యువకులంతా కృషి చేయాలి.

ఆఖరి రోజులలో రామకృష్ణ పరమహంస ఒక విషయం చెప్పారు. ఆయన కంఠంలో కాన్సర్ వచ్చింది. ఆహారం లోపలికి పోవటంలేదు. నరేంద్రుడు వచ్చాడు. 'స్వామీ! మీకు ఆహారం కూడా లోపలికి పోవటంలేదు గదా! తల్లిని ఎందుకు అడుగకూడదు? ఆహారం లోపలికి పంపించమని తల్లిని ఎందుకు ప్రార్థించకూడదు? అని అడిగాడు, అప్పుడు రామకృష్ణుడు నవ్వి 'అడిగినాను

నాయనా ! అమ్మను అడిగినాను జవాబు కూడా చెప్పింది' అన్నాడు. ఏమి చెప్పింది అన్నాడు 'ఇన్ని నోళ్లతో నేను తింటుంటే ఒక్క నోటితో తినకపోవటం వలన నీకేమి నష్టం '' అని అడిగిందన్నాడు. అందువలన నాకు సిగ్గు వచ్చింది. ఇంకా అమ్మను అడుగనన్నాడు రామకృష్ణుడు. అనగా ఏమిటి ? అన్ని దేహములు అమ్మవే. అన్ని కంఠములు అమ్మవే. అందుకోసమనే "అహం వైశ్వానరో భూత్వా..." నేను ప్రతి మానవుని యొక్క ఉదరమునందు వైశ్వానరరూపంలో వుండి, వాళ్లు తిన్నదంతా జీర్ణింపచేస్తున్నానన్నాడు భగవానుడు. మన హాస్టలులోనున్న పిల్లలకు బాగా తెలుసు. "బ్రహ్మార్పణం బ్రహ్మహవిః.." అని భోజనానికి ముందు ప్రార్థిస్తుంటారు కొంతమంది పిల్లలు మేము అర్పణ చేసుకుంటూ బ్రహ్మార్పణం అని అంటావేమిటి ? బ్రహ్మ ఎక్కడ ఉన్నాడు ? ఆ ప్రశ్న వేసేటప్పటికే "అహం వైశ్వానరో భూత్వా" అని లోపలినుంచి సమాధానం వస్తుంది. ఓరి పిచ్చివాడా! నేను ఎక్కడో ఉన్నాననుకుంటున్నావు, నీలోనే ఉంటున్నాను నీవు తిన్నదంతా జీర్ణింపజేసి, ఆ రసమును సర్వాంగములకు సప్లయి చేస్తున్నానంటాడు. ఏ ఒక్కరైనా ఈ స్వార్థరహితమైన పని చేస్తున్నారా ? ఒక్క దైవం మాత్రమే ఇంత చేస్తున్నాడు. నీవు స్వార్థంగా భుజించినదంతాకూడనూ జీర్ణింపజేసి, చక్కని శక్తివంతమైన రసముగా మార్చి సర్వాంగములకు సప్లయి చేస్తున్నాడు.

మహాభారతంలో కృష్ణుని యొక్క నిస్వార్థతత్వము చక్కగా గుర్తించదగినది. అనేకమంది రాజులను జయించాడు. ఎంతమందిని జయించినా తాను మాత్రం రాజు కాలేదు. ఎవరికో ఒకరికి పట్టం కట్టడం, తాను నిమిత్తమాత్రంగా వుండటం. ఒకానొక సమయంలో, అర్జునుడు ప్రశ్నించాడు, ''కృష్ణా ! ఇన్ని విజయాలు సాధిస్తున్నావు, ఎంతోమందికి పట్టం కడుతున్నావు. నీవెందుకు ఈ బాధ్యతలు తీసుకోవటంలేదు ఎంతోమందిని రాజులను చేస్తున్నావు. నీవు మాత్రం ఎందుకు రాజ్యాధికారమును తీసుకోవటంలేదు '' అని అడిగాడు. ''Kings గా చేస్తున్న King Maker ను నేను '' అన్నాడు శ్రీకృష్ణుడు. కాబట్టి King కన్నా King Maker చాలా గొప్పవాడు. నీ King Maker ఎక్కడ ఉన్నాడు ? నీ హృదయంలోనే ఉన్నాడు అన్ని అంగములకు శక్తినొసగుతున్నాడు కనుక దైవశక్తే సర్వశక్తులను నడిపిస్తున్నది ఆ విశ్వాసాన్ని యువకులు పెంచుకోవాలి ఆ విశ్వాసాన్ని పెంచుకుంటూ పోతే, మన జీవితంలో అత్యంత స్వల్ప కాలం లోపలనే మనం ఈ ఆనందాన్ని అనుభవించగలము అనుభూతి కావాలి. అనుభూతి కూడా మన హస్తంలోనే ఉంటున్నది. నీవు చేయలేకపోతున్నావే గాని, చేస్తే నీ అనుభూతి తప్పక వస్తుంది. కాని నీవు చేయలేనటువంటి బలహీనత, నీ అబలత్వం భగవంతుని పైన తోసి, భగవంతుని దూషిస్తున్నావు. "ఆడలేక మద్దెల ఓడు" అన్నట్లు అదే రీతిగా ఈనాడు చేసేటటువంటి శక్తిలేనప్పుడు, దైవం పైననే నెపములు మనం వేస్తున్నాము, వస్తుంటాయి అటువంటి బాధలు అప్పుడప్పుడు కాని విచారణ చేయాలి. విచారణచేసి ఇది నా దోషమా ? లేక దైవదోషమా ? దైవములో ఎట్టి దోషములూ లేవు, తాను గుణాతీతుడు, దోషరహితుడు నీ దోషములే నీకు ప్రతిబింబిస్తున్నాయి. నీ దోషములే నీకు అన్ని విధాలా అనుమానాన్ని చేకూరుస్తున్నాయి దైవములో కించిత్ అయినా దోషమును పెట్టటానికి ఎవరికీ వీలులేదు, ఎవరికీ చేతకాదు, ఎవరికీ అధికారంలేదు కష్టముల కోర్చుకోలేక, బాధలను భరించుకోలేక త్యాగరాజు కూడా రాముని పైన నెపంవేస్తూ వచ్చాడు ''స్వామీ ! నిరంతరమూ నిన్ను చింతిస్తున్నాను కదా ! నా భక్తిలో దోషమా ? లేక నీ శక్తిలో దోషమా ?" అని కొంతవరకు విచారించి నా భక్తిలో దోషంలేదు, నీ శక్తిలోనే దోషమున్నదనే నిర్ణయానికి వచ్చాడు త్యాగరాజు. ఈనాటి మానవులు

కూడా అంతే తమ దోషాలను మరుగుచేసుకుంటున్నాడు. పరులలో లేనటువంటి దోషాలను బయట పెడుతున్నాడు ఇది భక్తులలోనున్నటువంటి బలహీనత 'రామునిలో శక్తి లేదు నిజంగా అతనిలో శక్తి ఉంటుంటే నా కష్టములు ఎందుకు పరిహారము చేయకూడదు ? నా భక్తిలో దోషములేదు రామునిలోనే దోషము ఉండి వుండాలి' అని భావించాడు త్యాగరాజు, కాని ఆ తరువాత కొంచెం విచారణ చేశాడు. భగవంతుడు దోషరహితుడు, భగవంతుని హృదయము నిర్మలము, నిస్వార్థము అని తెలుసుకున్నాడు. ఇలాంటి భగవంతునిపై నిందలు వేయటం ఎంత దోషము ? నీలోనే శక్తి లేకపోతే !

" కపి వారధి దాటునా కలికి రోట కట్టునా
లక్ష్మీదేవి వలచునా లక్ష్మణుండు కొలచునా
సూక్ష్మబుద్ధి గల భరతుండు చూచిచూచి
మ్రొక్కునా
అబ్బ రామశక్తి ఎంతో గొప్పరా !

భరతుడు ఎంతో సూక్ష్మబుద్ధిగలవాడు, లక్ష్మణుండు సాకార స్వరూపాన్ని సేవచేస్తూ వచ్చాడు, రామునికి దూరంగా వుండి రామచింతన చేస్తూ వచ్చాడు భరతుడు అతనిది నిరాకార భక్తి. నిరాకారం లోపల కూడనూ రామునిలో లీనమయ్యాడు భరతుడు రామునిపట్టాభిషేక సమయంలో రాముడు, భరతుడు నీలవర్ణంగా ఉంటారు. దీనికి అంతరార్థమేమిటి? అనగా రామునిలో లీనమైనటువంటివాడు భరతుడు. భరతుడు, రాముడు అనే భేదరహితమైనటువంటివాడు భరతుడు ఏకాత్మ భావమును అనుభవించినటువంటివాడు భరతుడు ఈ విధంగా 'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి 'ఆ దైవచింతన చేస్తే తాము దైవమైపోవాలి నేను ఎంతోకాలము నుంచి దైవచింతన చేస్తున్నాను, నేను ఇంకా దైవముకాలేదే, దైవము కాలేదే అని చింతిస్తూపోతే నీవు దైవము కావు దయ్యమైపోతావు తెలియకుండా నీవు దైవముకావాలి.

కొంతమంది రమణమహర్షి వద్దకు వెళ్ళి 'స్వామి ! మేము ఎంతకాలం ధ్యానం చేయాలి ? ఒక గంటా ? లేక ఒక అరగంటా ? ఎంతసేపు చేయాలి ?' అని అడిగారు అప్పుడు నేను ధ్యానం చేస్తున్నాను అనే విషయం తెలియకుండినంతవరకు చేయమని చెప్పాడు రమణమహర్షి నేను ధ్యానం చేస్తున్నాను... అనుకుంటూ చేస్తే అది ధ్యానమెట్లా అవుతుంది? నేను ధ్యానం చేస్తున్నాననే విషయం తెలియకుండాపోవాలి అదే ధ్యానం. కడుపునిండేంతవరకు భోజనం చేయాలి అదే విధంగా హృదయం పండేంతవరకు మనం ప్రార్థించాలి. హృదయం పండటమంటే ఏమిటి ? ప్రతిదీ ప్రేమమయమైపోవాలి ఇట్టి ప్రేమతత్త్వాన్ని మనం పెంచుకుంటే, ఈ యుగములు, గడియలు కర్మలు, బంధములు మనల్ని ఏమాత్రం బెదిరించలేవు, మనం దేనికీ బెదరనవసరం లేదు, అదరనవసరం లేదు అన్నింటినీ ఎదుర్కొనటానికి తగినశక్తిని సముపార్జించాలి ఆ శక్తి ఎక్కడనుంచి వస్తుంది ? "నాలో దైవమున్నాడు" అనే విశ్వాసం నుంచి వస్తుంది ఆ విశ్వాసాన్ని పెంచుకోండి. అన్నీ మనకు విజయాలే చేకూరుతాయి. పంచాంగాలు చదివి ఈ సంవత్సరం ఏమౌతుందోనని చింతించకండి. పంచాంగం వ్రాసినవాడు సిద్ధాంతేగదా ! కాలస్వరూపుడైన భగవంతునినే మనం స్మరించుకొనినప్పుడు ఈ సిద్ధాంతి ఏమి చేయగలడు ? కనుక దైవచింతన చేస్తే అన్ని చింతలు పోతాయి. మనం ఏ పని చేసినా, ఇది దైవకార్యంగా విశ్వసించి, దైవార్పిత భావంతో చేయాలి. నూరు నేర్చుకోవడం కంటే ఒకటి చేసి చూపించాలి, ఆచరణలో పెట్టాలి. జన్మనిచ్చిన తల్లిని, జన్మించిన దేశమును స్వర్గముకంటే అధికంగా ప్రేమించాలి. అయితే ఈనాడు మాతృదేవి (Mother), మీదా ప్రేమలేదు, మాతృభూమి (Mother Land) మీద అంతకన్నా లేదు ఎవరినో Love (ప్రేమిస్తున్నాడు) చేస్తున్నాడు ఏమిటి ఈ Love ?

(తరువాయి 35 వ పేజీలో)

భగవాన్ సాయి దివ్యలీలలు :

# వాల్టర్ కొవాన్ (Walter Cowan)

— సేకరణ : కె. వెంకటేశ్వరరావు

ఈ రోజు సత్యసాయి భక్తులు లేని దేశం ప్రపంచంలో లేదేమో. ప్రపంచం నలుమూలల నుండి అనేక వేలమంది విదేశీయులు అనేక శ్రమలకోర్చి స్వామి దర్శనం కోసం పుట్టపర్తి, బెంగుళూరు రావటం ఇప్పుడు మనం చూస్తున్నాం. ఇరవై, పాతిక సంవత్సరాల క్రితం కొద్దిమంది విదేశీయులు మాత్రమే స్వామి దర్శనంకోసం వచ్చేవాళ్లు. వాళ్ళయినా ఆధ్యాత్మికచింతన కలిగినవారో, లేక పాశ్చాత్య జీవిత విధానంమీద విరక్తి చెందినవారో అయి ఉండేవాళ్లు.

అటువంటి కొద్దిమందిలో వృద్ధుడైన వాల్టర్ కొవాన్ (Walter Cowan) ఒకరు. అమెరికా (U. S. A.) దేశంలో వాల్టర్‌కొవాన్ ఒక పుస్తక ప్రచురణ సంస్థ అధినేత. ఆయన, ఆయన భార్య ఎల్సి (Elsie) 1968లో స్వామి భక్తులయ్యారు.

అది 1971 సంవత్సరం. స్వామి మద్రాసులో ప్రపంచ సత్యసాయి సంస్థల ప్రెసిడెంట్ల సమావేశం ఏర్పాటు చేశారు.

కొవాన్ దంపతులు స్వామి దర్శనం కోసం భారత దేశం వచ్చి డిసెంబరు 23 న మద్రాసులో హోటల్ కన్నెమరా (Connemara) లో బస చేశారు.

సత్యసాయి సంస్థల ప్రెసిడెంట్ల సమావేశాన్ని నిర్వహిస్తూ క్షణం తీరిక లేకుండా ఉన్నా స్వామి కొవాన్ దంపతులను ఎంతో ఆదరంగా పలకరించి వేదిక మీద కుర్చీలలో వారిద్దరినీ కూర్చోబెట్టి, ఎంతో ప్రేమ ప్రదర్శించారు.

డిసెంబర్ 25 వ తేది క్రిస్టమస్ రోజు ఉదయం 5 గంటలకు వాల్టర్‌కొవాన్ హోటల్‌లో తన పక్క మీద నుండి లేచి బాత్‌రూమ్‌కు వెళ్ళబోతూ స్పృహతప్పి నేలమీద పడిపోయారు. శ్రీమతి ఎల్సి హోటల్ సిబ్బంది సహాయంతో ఆయనను పక్కమీద పడుకోబెట్టే ప్రయత్నం చేస్తుండగా వాల్టర్ ప్రాణాలు వదిలివేశారు.

కన్నెమరా హోటల్ చాలా పెద్దది. ఆ హోటల్‌లో ఎప్పుడూ ఒక డాక్టర్ ఉంటారు. హోటల్ డాక్టర్ వచ్చి పరీక్షించి వాల్టర్ కొవాన్ ప్రాణం పోయిందని నిర్ధారించారు. శ్రీమతి ఎల్సికొవాన్ మనసులోనే స్వామిని ప్రార్థించింది. కొద్దిసేపటికి హోటల్‌వారు పిలిపించగా ఒక అంబులెన్సు వచ్చి వాల్టర్ కొవాన్‌ని గవర్నమెంటు హాస్పటల్‌కి తీసుకొని వెళ్ళింది. హాస్పటల్‌లో వున్న డాక్టరు మళ్ళీ పరీక్షచేసి, ప్రాణం పోయిందని నిర్ధారించి హాస్పిటల్ వారిచ్చే Death Certificate వ్రాసి సంతకం పెట్టి వాల్టర్‌కొవాన్ ముక్కు చెవులలో దూది పెట్టి, తెల్లని వస్త్రం కప్పి ఆ శరీరాన్ని శవాల్ని భద్రపరచే చోటికి పంపించారు.

శ్రీమతి ఎల్సికొవాన్ భర్త శరీరంతో హాస్పిటల్‌కి వెళ్ళలేదు. తెల్లవారిన తరువాత ఆమె మరొకరిని తోడు తీసుకొని స్వామి వద్దకు వెళ్ళి జరిగినదంతా చెప్పింది. అంతా చెప్పిన తర్వాత స్వామిని ఇలా ప్రార్థించింది. 'స్వామి ! మీ చిత్తమేదైతే అలా జరగనివ్వండి'

స్వామి 'పది గంటలకు హాస్పిటల్‌కు వస్తాను' అని మాత్రమే చెప్పి ఆమెను పంపించివేసారు. భర్త

పోయినందుకు శ్రీమతి ఎల్సి దుఃఖించలేదు, స్వామి ఆమెను ఓదార్చలేదు.

10 గంటలకు శ్రీమతి ఎల్సికొవాన్ హాస్పిటల్‌కు వెళ్ళింది. అప్పటికే స్వామి హాస్పిటల్‌కు వచ్చి వెళ్ళిపోయారని తెలిసింది

ఆమె లోపలకు వెళ్ళేసరికి, వాల్టర్‌కొవాన్ శరీరం హాస్పిటల్ సిబ్బంది ఉంచిన ప్రదేశంలో లేదు. ఆయన ముక్కు చెవులలో దూది లేదు. ఆయనమీద తెల్లని వస్త్రం కప్పిలేదు, ఆయన కుర్చీలో చాలా ఆరోగ్యంతో కూర్చుని వున్నారు ఆది చూచిన ఆమెకు నోట మాట రాలేదు. ఆ సమయంతో వాల్టర్‌కొవాన్ చనిపోయారని సర్టిఫికెట్ ఇచ్చిన డాక్టరు కూడా వచ్చి ఆయన్ని చూచి చాలా ఆశ్చర్యపోయారు.

వాల్టర్‌కొవాన్ తన ప్రాణాన్ని విడిచిన 5 గంటలలో ఏమి జరిగిందో ఇలా వివరించారు. 'ఊపిరాడక 5 గంటలకు లేచాను ఊపిరి పీల్చడానికి అవస్థపడ్డాను. ఆ సమయంలో నేను నా శరీరంలోంచి బయటకు వచ్చేశాను. పూర్తి ఆనందంలో మునిగిపోయాను ఎంతో హాయి అనిపించింది. ఎల్సీ కంగారుపడటం చూసాను. ఇది జరుగుచుండగా స్వామి నా దగ్గరకు వచ్చి నన్ను నాకు తెలియని ఒక ప్రదేశానికి తీసుకువెళ్ళారు అక్కడ అనేక వందలమంది తాళపత్రాల వంటి వాటిని చదువుతున్నారు. స్వామి నన్ను ఒక వ్యక్తి వద్దకు తీసుకొని సహాయంగా వలకరించి అనేక గ్రంథాలు బయటకు తీసాడు. ఆ గ్రంథాలన్నీ వివిధ భాషలలో వున్నాయి అవన్నీ నా పూర్వజన్మల చరిత్రలని గ్రహించాను. అవి ఆ చదువుతుం ను గత జన్మలో అనేక ముఖ్యమైన పనులు చేసానని అర్థమైంది. నా గురించిన గ్రంథాలు చదవటం అయిన తరువాత, స్వామి ఆ వ్యక్తితో ఇలా అన్నారు. 'ఈ వాల్టర్‌కొవాన్‌ని నేను తిరిగి తీసుకొనివెళ్తాను ఇతను భూమిమీద చేయాల్సిన పని ఇంకా కొంత మిగిలిఉన్నది' అందుకు ఆ వ్యక్తి అంగీకరించాడు. తర్వాత క్షణంలో మళ్ళీ ఈ శరీరంలోకి వచ్చేశాను'

వాల్టర్‌కొవాన్ చనిపోకముందు మధుమేహ వ్యాధి. ( Diabetes ) కడుపులో పుండ్లు (Ulcer) తో బాధ పడుతూండేవాడు.

స్వామి పునర్జీవితం ఇచ్చిన తర్వాత శరీరానికివున్న వ్యాధులన్నీ పోయి సంపూర్ణ ఆరోగ్యవంతుడయ్యాడు.

శ్రీమతి ఎల్సీకొవాన్ ఇలా తన సంతోషాన్ని వ్యక్తం చేసింది. భగవంతుడైన సత్యసాయి మాత్రమే చనిపోయిన వారిని బ్రతికించగలరు ఆ కృపకు పాత్రుడైన నా భర్త ఎంతో ధన్యుడు'.

)–○–(

ఉగాది సందేశం.... ( 33 వ తిరువాయి )

Love చేయవలసింది తల్లిని, దైవమును తల్లి ప్రేమ ఒక్కటే వుంటే, అన్ని ప్రేమలూ దానిలో లీనమైపోతాయి. కనుక భగవంతుని చింతిస్తూరాండి, భగవంతుని ప్రేమిస్తూరాండి అతనికంటే మించిన స్నేహితుడు మనకు లోకంలో లేడు. కనుక స్వార్థ రహితుడైనవాడు భగవంతుడు అతనిని మిత్రునిగా చూచుకో మిత్రునిగా ప్రేమించు, అతని ప్రేమలో నీ ప్రేమను లీనం చేసేయి. అదే చాలు ....

( ది 1-4-95 న ప్రశాంతి నిలయంలో భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు చేసిన ఉగాది దివ్య సందేశము నుండి )

రసవద్ఘట్టాలు - 15

# ఒకే ఒక మొరార్జీ

-జానమద్ది హనుమచ్ఛాస్త్రి

ఎందరో మనుషులున్నారు. వారిలో మనుష్యులన్నమాట కొందరికే వర్తిస్తుంది. ఆ భావాన్నే 'పురుషులందు పుణ్యపురుషులు వేరయా' అన్న పదాల్లో వేమన చెప్పాడు.

అట్టి పుణ్యపురుషులలో అతి విశిష్టమైన వ్యక్తి మొన్న కన్నుమూసిన మొరార్జీ దేశాయ్.

ఆయన బొంబాయి ప్రెసిడెన్సీలో డిప్యూటీ కలెక్టర్‌గా పనిచేసాడు. మంత్రి అయ్యాడు, ముఖ్యమంత్రి అయ్యాడు. కేంద్రంలో మంత్రిగా, ఉపప్రధానిగా, తుదకు భారత ప్రధానిగా సేవలందించాడు.

దాదాపు నాలుగు దశాబ్దాలపాటు ఉన్నత పదవుల్లో కొనసాగారు. 83 ఏళ్ళ వయసులో రాజకీయాలనుండి విరమించుకొన్నాడు.

తన కోసం ఏనాడూ ఆయన బ్రతకలేదు, జీవితాంతం ప్రజాహితంకోసం కృషి చేసాడు.

ఆయన ప్రథమశ్రేణి విద్యార్థి, ప్రథమశ్రేణి దేశభక్తుడు, ప్రథమశ్రేణి పాలకుడు. అన్నిటికీమించి మహోన్నతమైన మనీషి.

క్రమశిక్షణ ఆయన జీవనవేదం. 97-98 ఏళ్ళ వృద్ధాప్యంలో ఒక సభకు వెళ్ళాల్సివచ్చింది. బొంబాయిలోని ఒక భవనం ఆరవ అంతస్తులో సభ. విద్యుచ్ఛక్తి సరఫరా ఆగిపోవటంతో లిఫ్ట్ పనిచేయలేదు. తమ నిర్ణీత కార్యక్రమాన్ని ఎలా మానుకుంటారాయన? ఆ వయసులోకూడా చకచకా నడుస్తూ ఆరవ అంతస్తు చేరారు.

మొరార్జీ బీద కుటుంబంలో పుట్టారు. సూరత్ జిల్లా వల్సాడ్ పట్టణ సమీపంలోని భదేలియ, రణఛోడ్‌జీ దేశాయ్ కుమారునిగా జన్మించారు. తండ్రి బడిపంతులు. ప్రాథమిక పాఠశాల పంతులుగ బడులలపై వెళ్ళేవారు. మొరార్జీ మేనమామ గారింట్లో వుంటూ చదివారు.

ప్రతిరోజూ ఔరంగానది దాటి, మూడు మైళ్ళు నడచి, హైస్కూలు చదువు సాగించాడు. ఇంట్లో పశువుల మేత, పాలు పితకటం వగైరాలన్నీ చేసేవాడు.

మెట్రిక్ పరీక్ష కూడా పాసు కాలేదు, అంతలోనే గజరాబెన్‌తో ఆయన పెళ్ళి జరిగింది. హైస్కూల్ చదువు పూర్తి అయింది. చదువు, శరీర వ్యాయామం తప్ప మరేం ఎరుగనివాడు, క్రికెట్ అంటే ఎక్కువ ఇష్టం. విల్సన్ కాలేజీలో చదివి పట్టభద్రులయ్యారు. కాలేజ్ యు టి సి (నేటి N C C) లో గొప్ప పేరు గడించాడు. పెద్ద చదువులు చదవాలనుకొన్నారు. ఆర్థిక ఇబ్బందులు అడ్డుతగిలాయి.

బొంబాయి ప్రెసిడెన్సీ ముఖ్యమంత్రిగా వున్నప్పుడు ఆయన కూతురుకు స్వీయప్రతిభవల్ల మెడికల్ కాలేజీలో ప్రవేశం లభించింది. అప్పట్లో అడ్మిషన్ ప్రధానంగా ఇంటర్మీడియేటు మార్కుల ఆధారంగా జరిగేది. ఆమె మార్కుల ప్రాతిపదికపై ఆమెకు కె ఇ ఎం. లేదా నాయర్ ఆసుపత్రిలో చేరాలి. మొరార్జీగారి కూతురికి నాయర్ ఆసుపత్రిలో ప్రవేశం ఇచ్చారు. తనను కె ఇ ఎం ఆసుపత్రిలో చేర్చమని తండ్రి కోరింది. మొరార్జీ వీలుకాదన్నారు, అందరికీ ఒకే న్యాయము. "నీకు ఎక్కడ సీటు దొరికిందో అక్కడే చదువు, లేకపోతే చదువు మానుకో" అన్నారు.

ఆయనకు మంగలితో పనిలేదు, చాకలితో పనిలేదు. అంతా ఆయనే చేసుకునేవారు. భోజనంలో నూనెలేదు, మసాలా లేదు, చక్కెర అసలేలేదు. చాలాకాలం ఉప్పు మానేసారు. ఉదయం ఉపహారంలేదు. 10 గంటలకు భోజనం. సాయంత్రం ఒక గ్లాసు పాలు, కొద్దిగ ఖర్జూరం. ఇలా సన్యాసుల నియమాలకు మించిన అలవాట్లు ఆయనవి.

రోడ్డు రవాణా సర్వీసులను మొదటసారి జాతీయం చేసినవారు మొరార్జీ. పట్టుదలకు పెట్టినపేరు మొరార్జీ.

ఫినిక్స్‌పక్షి కాలిబూడిదగా మారుతుంది, ఆ భస్మరాశినుండే మరల రివ్వున ఎగురుతుంది. అట్టి అగ్నిపరీక్షలలో పునీతులైన పుణ్యపురుషులలో సాటిలేని మేటి మొరార్జీ.



# SRI SAI HARI REAL ESTATES

**PUTTAPARTHI - 515 134**

**ANANTHAPUR Dt. ANDHRA PRADESH**

పుట్టపర్తియందు ప్లాట్లు, ఇండ్లస్థలములు కావలసినవారు, అమ్మదలచినవారు ఈ క్రింది చిరునామావారిని సంప్రదించవలెనని కోరడమైనది.

1. సూపర్ స్పెషాలిటీస్ హాస్పిటల్ ఎదురుగా ప్లాట్లు
2. గోకులం పోస్టాఫీసు ఎదురుగా ప్లాట్లు
3. M. R. O. ఆఫీసు ఎదురుగా ప్లాట్లు
4. బీడుపల్లికి పోవు బస్సు రోడ్డు వద్ద ప్లాట్లు
5. ప్రశాంతి నిలయం దగ్గరలో గల ప్లాట్లు
6. అపార్టుమెంట్స్ కావలసినవారు కూడా సంప్రదించండి.

నెలకు రు 600/- ల స్కీములో చేరండి. (36 నెలలు) ప్రతి నెలా లాటరీ తీయబడును. బంపర్ డ్రా మారుతీ కారు. 2 సెంట్లు 20 × 40.

☞ గమనిక : భగవాన్ శ్రీ సత్యసాయిబాబా డెబ్బై (70) వ జన్మదిన శుభ సందర్భంగా 23-11-95 న శ్రీ సాయి భక్తులకు మా చిరుకానుకగా అపార్ట్‌మెంట్స్ కావలసిన వారికి డెబ్బై వేల (70 వేలు) రూపాయలకు రిజిస్ట్రేషన్‌తో సహా ఇవ్వగలము.

వివరములకు :

గ్రంథి యుగంధర్
బాబా చైతన్య సూపర్ బజార్
గుంటూరివారి తోట,
గాంధీబొమ్మ దగ్గర
గుంటూరు - 522 001
Phone : 21988

ఇట్లు
శ్రీ సాయిహరి రియల్ ఎస్టేట్స్
ప్రొ॥ పి. సిద్ధయ్యశెట్టి
ఆర్యవైశ్య సత్రం ఎదురుగా
పుట్టపర్తి - 515 134
Phone : 7413
S T D 08555